# తానీషా నాటకము

[తానాషా అక్కన్న మాదన్నల చరిత్ర]

వేదము వేంకటరాయశాస్త్రి M. A.

ప్రథమ ముద్రణము

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్.

1. [illegible]

శింగి సాల్టివీధి, మదరాసు. 1.

1955

 Re 1-0-0

# ఇందలి పాత్రములు

| పాత్రములు | వారువచ్చు దృశ్యములు |
|---|---|
| తానాషా - గోలకొండసుల్తాను | 2, 5, 7,9,11,13,16,18,20 |
| అక్కన్న, మాదన్న } మంత్రులు | 1,2,3,5,7,11,12,13 |
| అబుల్ రజాక్ లారీ - సేనాపతి | 2,7,11,13,16,18,19,21 |
| ఔరంగజేబు - ఢిల్లీ పాదుషా | 4,15,17,21 |
| సాదత్ ఖాన్ - మొగలు రాయబారి | 2,4,8,10,14,15 |
| సాదత్ సిఫాయి - | 8,10,14,15 |
| శివాజీ - మహారాష్ట్ర ప్రభువు | 7 |
| నేతాజీఫాల్కర్ | 7 |
| ఫకీరు, తానాషాగురువు | 9 |
| ఒకభట్టుగారు | 3 |
| గోపన్న | 3 |
| అబ్దుల్లాఖాన్ పానీ, ద్రోహి | 2,5,7,9,11,13,21 |
| అత్తిమత్తరావు, ద్రోహి | 10,11 |
| మీర్ హాషీమ్, మీర్ ఇబ్రహీం } ద్రోహులు | 11,15,21 |
| 2 మొగలుసర్దారులు | 20,21 |
| 2 మొగలుసిపాయీలు | 19,21 |
| మొగలుదౌవారికుఁడు | 4,15,21 |
| 8 సేవకులు, గోలకొండవారు | 7,11,13,16,18 |
| 1 గోలకొండవజీరు | 2 |
| 1 బాటసారి | 1 |
| దండోరాసిఫాయి | 1,2,6 |
| వెట్టివాఁడు, దండోరా | 1,6 |
| తానాషానౌకరు, దౌవారికుఁడు | 14,16,20 |

# తానీషా నాటకము

## [తానాషా అక్కన్న మాదన్నల చరిత్ర]

---

## దృశ్యము ౧

గోలకొండలో నొక వీధి.

[అంతట వెట్టివాఁడు డప్పు వాయించుచును, అతని వెంట పెద్ద తెల్లని గట్టికాగితమును పట్టుకొని ఇరువురు సిపాయీలును ప్రవేశింతురు]

వెట్టివాఁడు.—[డమ డమ డమ అని వాయించి] ఓహో! హిందువుగాని మహమ్మదీయుడుగాని, ఎవడైనా ఈ కాగితం చదివి ఇందులో ఉండే రహస్యం చెప్పగల్గావోడికి అబుల్‌హాసన్ తానాషాసుల్తాన్ బహద్దర్ వారు వసారత్ ఉద్యోగం ఇచ్చి చాలా గౌరవంచేస్తారు. [డమ, డమ, డమ, డమ] ఎవరైనా చదవ గలవోళ్లు ముందుకు రావచ్చును. హో! [డమ డమ డమడం]

ఒక బాటసారి—[ఎదురుగా ప్రవేశించి] ఓరి! అల్లదా! మూడునెల్లబట్టి తిరుగుతున్నారు; ఈ గోలకొండలో ఎవరూ దొరకలేదంటయా వొట్టికాగితం చదివేవోళ్లు [నవ్వుచు] అచ్చురాలుంటే చదవతారా లేకపోతే చదవతారా? హ్హా! హ్హా! హ్హా! బలేవుంది హాస్యం [అని నవ్వుచు పోవును]

[లోపల వెనుకనుండి 'ఓహోయి తానా, ఓహోయి చాటింపూ"]

[చాటింపువాండ్రు నిలిచి వెనుకకు తిరిగిచూతురు. అన్నదమ్ముల వంటివారు ఇరువురు యువకులు ప్రవేశింతురు]

ఒకడు—ఓయి తానా, ఇలా రా. తమ్ముడూ ఆ కాగితం అందుకో.

తమ్ముడు—ఇద్దరం చూదాం అన్నయ్యా [దండోరా వారితో] అయ్యా ఆకాగితం చూపండి బాబూ.

[వారు చూపుదురు.

తమ్ముడు—[చూచి] అక్కన్నా చూచావా ?

అక్కన్న—బలే మాదన్నా ఇది మనం చదివేయగలం. [దండోరా వారితో] అయ్యా ఈ కాగితం మేం చదవగలం.

దండోరాసిఫాయి—ఏమి హాశ్చర్యం ! మూడునెలల్ కాలంనుంచి ఈజాబు ఎవరూ సద్వలేక మేం ప్రతిదినం ఈ గోల్కొండ పన్నెండు పెద్దవీధులు దండోరా తిప్పుతున్నాము. మీరు ఎవరో కొత్తగా వచ్చినారు. ఈజాబు సద్వతాము చెప్తారు ! నిజంగా మీకు అట్వంటిగ్నానం ఉందా ?

మాదన్న—సాయెబూ నీదయ ఉంటే ఈజాబు కాదు ఇటువంటివి ఎన్నైనా చదివి బదులుకూడ వ్రాయగలం. త్వరగా సుల్తాన్ బహద్దర్ వారికి కబురుచేయించు సాయెబూ.

దండోరాసిఫాయి—అచ్ఛా, అచ్ఛా. మీరు ఎవరో హసాధ్యులు ఉన్నార్. మరిరండి సుల్తాన్వారి దర్శనాన్కి.

[అందరు నిష్క్రమింతురు.

---

# దృశ్యము ౨

## తానీషా సుల్తాన్ దర్బారు.

[అంతట తానాషా, అబ్దుల్ రజాక్ లారీ, వజీర్లు, మొగల్ రాయబారి సాదత్ ఖాన్ మొదలైనవారు ఉచితాసనముల ప్రవేశింతురు]

సాదత్ ఖాన్—తానాషా సుల్తాన్ బహద్దర్, ఔరంగ్ జీబ్ ఆలంఘీర్ పాదుషావారు మాకీ గోల్కొండకిరంపి మూడు మాసాల్ ఐనది. మేం తెచ్చిన జాబు ఇప్పట్కీ ఎవరూ చద్వలేదు. ఇక్కడ సర్కార్లో లేకోతే ధూరం ఫర్గణాల్లోను గ్రామాల లోను ఎవరూ ఉంటార్ ? వారికి తెల్వాయిస్తే మేముపోతాం, పాదుషావారితో చెప్పేయేస్తాం—గోల్కొండారాజ్యంమే మా జాబు చద్వేదాన్కి ఎవడ్కి షక్తీ సామర్థ్యం నహిం—అని.

తానాషా—[ప్రశాంతముగా] అవసరపడవద్దు సాదత్ ఖాన్ భాయి. మా ఆంధ్రదేశం చాలావిస్తీర్ణం చేతా దూరంలో ఉంటారు ముసద్దీలు. అందుచేత వార్కి కనిపట్టడం అసాధ్యం వుంది. సమాచారం అందడంకూడా ఆలస్యం ఔతుంది. [వజీర్లను చూచి] అయితే ఇంకా ఎవరూ దొరకలేదా వజీర్సాహేబులు.

అబ్దుల్ రజాక్—మనకి కొంచెం నిదానం కావాలా తోస్తుంది హుజూర్.

దౌవారికుడు ప్రవేశించి—తఫావద్ బాఅదబ్, సలాం సలాం, మనదండోరా సిఫాయీలు ఈదినం ఇద్దరు బొమ్మణపంతుళ్లకీతెచ్చినార్. దర్షణానికి కాచుకొని ఉన్నార్.

తానాషా—చాలా సంతోషం, రమ్మను.

దండోరాసిఫాయి—[ప్రవేశించి] సలాం, సలాం, సర్కార్ వీరే మన తెలంగీ ముసద్దీలు, ఈజాబుకి సద్వుతారు.

అక్కన్న మాదన్నలు—[మోకరించి సలాములు చేయుదురు] సలాం సుల్తాన్ బహద్దర్ వారికి.

తానాషా—అచ్ఛా! అన్నతమ్ములు ఒకటే ఆకారం ఉన్నారు. మీ పేరు యేమి.

దండోరాసిఫాయి—ఈయన అక్కన్నగారు, ఈయన మాదన్నగారు.

తానాషా—అచ్ఛా, రండి పంతులుగార్లూ రండి, కూర్చోండి, మీది ఏవూరు, మీ తండ్రిగార్కి ఏమిపని.

మాదన్న—మహాప్రభూ మాది ఓరుగల్లు, మాతండ్రి గారు పింగళి భానూజీపంతులుగారు, ఓరుగంటి అమీలుక్రింద సుంకాధికారి. వారు మాకు ఎన్ని యోవిద్యలు నేర్పినారు. మా మాతృభాషలగు సంస్కృతాంధ్రములే గాక పెక్కుదేశభాషలను అరబ్బీ ఫారసీభాషలను నానావిధములైన లిపులను మాకు నేర్పినారు. ఎట్టి అసాధ్యములైన లెక్కలైనను మేము వేయగలము. ఎటువంటి రాచకార్యమైనను తమవంటి ప్రభువులు దయదలచిన క్షణములో సాధింపగలము.

తానాషా—చాలాసంతోషం. ఆ జాబుసద్వండి పంతులు గార్లూ.

మాదన్న—మహాప్రభూ, ఇందలి విషయములు చాల రహస్యమైనవి. తమకుమాత్రమే తెలియవలెను.

తానాషా—అచ్ఛా [అని సభ్యులవంక చూచును.

సభ్యులు నిష్క్రమింతురు.

తానాషా—ఇప్పుడు చదవ్వండి.

మాదన్న—ఇదుగో మహాప్రభూ చూడుడు, ఈవిశేష మును. ఈ తడిగుడ్డతో ఈకాగితమును తడిపెదను, తమకు అక్షరములు కనబడును. [అని తడుపును.

తానాషా—ఆహా! ఏమి హాశ్చర్యం! అక్షరాలున్నవి, కంటికి తెలుస్తుంది. [చూచి] కుశలప్రశ్న ఇది, అంతే.

మాదన్న—మహాప్రభూ, ఇది తెల్లసిరా. అందుచేత తెలియలేదు. దీనిరహస్యము మాతంత్రిగారు మాకు చిన్నప్పుడే బోధించినారు. ఔరంగజేబు ఆలంఘీరు పాదుషా దీనిసంపుటలో గోలకొండ సర్దారులలో ఎటువంటివా రున్నారని పరీక్షచేయు చున్నది. మహాప్రభూ మహారాష్ట్రమునకు వారివలన ఉపద్రవము తప్పదు. బిజాపూరుమీద మొగలాయీలు బలముగా సన్నాహ ములు చేయుచున్నారు. బిజాపూరు పడిపోయినచో మనవంతు తప్పదు. చాల జాగ్రత వహింపవలెను.

తానాషా—అవును మీమాటనిజం. ఔరంగజేబ్ ఎప్పటి కైనా ఈగోల్కొండాకీ, ఈ విశాలాంధ్ర సామ్రాజ్యాన్కీ తిన డాన్కి ఉన్నాడు. మాసర్దార్లు ఒకరితో ఒకరు, బుద్ధిలేక, జగడ మాడుతారు. కానీయండి చూస్తాం.

మాదన్న—మహాప్రభువుగారితో పదిమాటలేల? మేము తమచిత్తము వచ్చినట్లు మెలగెదము.

తానాషా—అచ్ఛా అదే మాకీకావాలా. మీవల్ల మాకీ చాలాపని కావలసిఉంది. చూస్తాం. ముందు ఈజాబుకు జవాబ్ తయార్ చెయ్యండి. వట్టి క్షేమసమాచారం.

అక్కన్న—ఎంత! క్షణము. ఇదుగో బదులు

[అని మాదన్నతో నిష్క్రమించును.

తానాషా—ఎవరురా అక్డ, అందర్కీ రమ్మను.

[అందఱు మరలవచ్చి కూర్చుందురు.

తానాషా—రాయ్యారీభాయ్ రండి. మీజాబు మా పంతుల్లు చదివినారు. మీకు జవాబ్ తయార్ చేస్తున్నారు.

అక్కన్న మాదన్నలు ప్రవేశించి—మహాప్రభూ ఇదిగో బదులు.

తానాషా—భాయ్ ఇద్గో మీకీ జవాబ్. మీరు దీన్కి పాదుషాగార్కి రవాణా చెయ్యండి. మీ చమత్కారంజాబులు సద్వేవారు మాదేశంలో లేరని మీరు తల్వావద్దు. వజీర్సాహెబ్ ఈ పంతుల్లు మాకీ చాలాగౌరవం చేసినార్. వీరి తెల్వి అపారం, ఆశ్చర్యం, సంతోషం ఉంది. వీర్కి మేం వసారత్ ఉద్యోగం ఇచ్చినాం. ఇడ్డే ఫర్మానా అంతా తయార్ చెయ్యండి. మిగిలిన మర్యాదా అంతాచేసి ఊరేగింపుతో ఇంటికి పంపండి. వీరు మా సొంత గుమాస్తాలు.

వజీర్—సర్కార్ చిత్తం. అంతా ఇడ్డేచేస్తాం.

[అందఱు నిష్క్రమింతురు.

---

# దృశ్యము 3

గోలకొండలో నొక వీథి.

[అక్కన్న మాదన్నలు వచ్చుచుండగా ఎదుట నొక భట్టుగారు ప్రవేశింతురు]

అక్కన్న—భట్టుగారూ నమస్కారములు.

మాదన్న—నమస్కారములు.

భట్టు—దీర్ఘాయుష్యమస్తు. సకలశుభపరంపరాప్రాప్తిరస్తు. చాలాసంతోషం. మీకు రాజదర్శనాలుకావడం ఉద్యోగాలు రావడం! బుద్ధిమంతులు ఎక్కడైనా వృద్ధికి వస్తారు.

మాదన్న—మరి మాస్వప్నఫలాలు చూచి సెలవిస్తామన్నారు.

భట్టు—ఆహా! స్వప్నశాస్త్రమంతా మీకోసం తిరగవేశాను. మీకు నిన్నపగలు సుల్తానుగారి దర్శనము రాత్రి శుభస్వప్నములు. ఈ గోలకొండరాజ్యం మీచేతులమీదుతుంది కాబోలు! ఎవరు చెప్పగలరు? మరీ వినండి, దివ్యమైనకల మీది. స్వప్నశాస్త్రంలోచెప్పినట్టు మూడవజాములో వచ్చినకల మూడునెలల్లో ఫలిస్తుంది. మీకు ఈవసారత్ గుమాస్తాగిరి మూడునెలలు మాత్రమే. తర్వాత అక్కన్నా, నీకు మహాసేనాధిపతి ఉద్యోగమున్నూ, మాదన్నా, నీకు మహామంత్రిపదవిన్నీ అమ్మవారు ప్రసాదించింది. తానాషాసుల్తాన్ భక్తకోటిలో భజనచేస్తూఉన్నట్టు కనబడ్డందువల్ల అతడు మహమ్మదీయుడే ఐనా మహాభక్తుడని వేదాంతి అని పూజింపదగినవాడని తెలుస్తున్నది.

[లోపలినుండి-'రామా, శ్రీరామా, పరంధామా, భద్రాద్రిరామా.']

భట్టు—ఇదుగో మనగోపన్న వస్తున్నాడు.

గోపన్న—[ప్రవేశించి] మామయ్యా, కనుక్కున్నాను, నాకంతా తెలిసిపోయింది.

అక్కన్న—ఏం తెలిసింది గోపన్నా ?

గోపన్న—చాలా రహస్యం. తానాషా సుల్తాన్ సామాన్యుడు కాడు. మహావేదాంతి. చాలా నెమ్మదిగలవాడు. ఉర్దూ ఫారసీభాషలలో కవి. గొప్ప పారసీకవర్తకుని కుమారుడట. రాజబంధువే ఐనా తండ్రి పదునాలుగోయేట చనిపోవడంవల్లనూ పెద్దలుచేసిన అప్పులవల్లనూ దరిద్రుడై పదునాలుగుసంవత్సరాలు, తన వివాహపర్యంతము ఒక మహమ్మదీయ సన్యాసికి శిష్యుడై యుండి, అకస్మాత్తుగా అంతఃపురంలోని జగడాలవల్లను, తాను రాజకుటుంబానికి దూరబంధువు కావడంవల్లను సుల్తానుకు అల్లుడైనాడట. ఆస్వాములవారికిన్నీ సుల్తానుకున్నూ హిందువైనా మహమ్మదీయుడైనా ఫరవాలేదట, వేదాంతిగా ఉంటే చాలట. తురకలలో వీళ్లు సూఫీవేదాంతులు. సుల్తాన్ గురువుగారి కొమారుడే బడే అక్బర్ సాగారు, శృంగారమంజరి అని రసమంజరిని మించిన ఆంధ్రకావ్యం వ్రాశాడు. అది సంస్కృతానికి తర్జుమా అయింది కూడా. వీరందరూ నిజమైన ముసల్మానులు, హిందూ పక్షపాతులు.

మాదన్న—మహమ్మదీయులైతేమాత్రం ఆంధ్రులే గదటోయి. వాళ్ల ఆంధ్రాభిమానం మనకు రెండింతలు.

అక్కన్న—అదంతా మంచిదే మాదన్నా. ఆ దుష్టమంత్రులు ముజఫరూ, మూసాఖానూ ఉండేవరకూ సుల్తానుకు స్వాతంత్ర్య మేదీ ?

మాదన్న—అదే అన్నయ్యా, సుల్తాన్ రహస్యంగా వీళ్లను తొలగించే మార్గం అడిగితే, తటాలున తొలగిస్తే బాగుండదు మెల్లగా వారిమీద తప్పులు తయారుచేసి ఒకదినం పంపించెయ్యాం డని చెప్పాను.

అక్కన్న—ఏమన్నాడు సుల్తాన్?

మాదన్న—ఒప్పుకొన్నాడు. ఉపాయమడిగాడు, వాళ్ల కిద్దరికీ జగడంపెట్టడమే ఉపాయమన్నాను.

అక్కన్న—శెబాష్! ఎల్లా పెట్టగలవు?

[లోపలనుంచి—సర్దార్ సాహెబ్]

మాదన్న—అడుగో ఎవరో వస్తున్నారు. తర్వాత చెప్తాను. [అందఱు నిష్క్రమింతురు.

---

# దృశ్యము ౮

ఔరంగజేబు పాదుషా మంత్రాగారము.

సాదత్ ఖాన్—[ప్రవేశించి] ఈతానాషా సుల్తాన్ సంగతి ఔరంగజేబ్ అలంఘీర్ పాదుషాగారికి చెప్పి గోల్కొండా నాశం చెయ్యకపోతే నేను మొగల్ రాయబారి సాదత్ ఖాన్ కాదు.

[ఔరంగజేబు అంగరక్షకులతో ప్రవేశించును]

ఔరంగ—ఓహో! సాదత్ ఖాన్. ఎప్పుడువచ్చినారు వజీర్ సాహేబ్? గోల్కొండా సమాచారం ఏమి?

సాదత్—సలాం, సలాం, జహాపనా. ఇప్పుడే వచ్చినాన్ హుజూర్. ఇప్పుడు గోల్కొండాలో ఇద్దరు బొమ్మన్లు వజీర్లు ఐనార్. పాతవాళ్లను సుల్తాన్ బందిఖానాలో వేసినాడు. ఇప్పుడు ఈబొమ్మన్లు ఖజానాగిజానా తయార్ చేస్తా ఉన్నార్. రైతులకి పట్టాలు యిస్తారు. దొంగలభయం తక్వా ఐతావుంది. తానాషా సుల్తాన్ హాయిగా నిద్రపోతా ఉన్నాడ్.

ఔరంగ—మనతెల్లజాబు ఎవరు సద్వినార్.

సాదత్—వీళ్లే జహాపనా, ఈకొత్త తెలంగీమంత్రులు, అక్కన్నా మాదన్నా నామ్‌చెప్తార్ వాళ్లకి.

ఔరంగ—ఈ గోల్కొండాసామ్రాజ్యం ఎంతవుంది?

సాదత్—సర్కార్, ఈ గోల్కొండరాజ్యం చాలా విశాలంవుంది. అంతా ఆంధ్రదేశం. ఉత్తరంలో శ్రీకాకుళంమొదల్ దక్షిణంలో పుదుచ్చేరివరకు, తూర్పుసముద్రతీరం మొదల్ పడమట బిజాపూరువరకు, అట్లే కర్ణాటకమహారాష్ట్ర దేశాల ఎల్లలవరకు ఉంది. ఇంత విశాలాంధ్రదేశాన్ని పూర్వం శ్రీకృష్ణదేవరాయలుకూడా తన సొంతపరిపాలనలో అనుభవించలేదు. ఈ ఆంధ్రదేశంలో బంగారంపండుతుంది జహాపనా, బంగారం. వజ్రపుగనులున్నవి ఇక్కడా. పైరుపంటలు పచ్చగా ఆనందంగా ఉన్నవి. రేవుపట్టణాలులో మంచివ్యాపారం జరుగుతుంది. తానాషా సుల్తాన్‌కు మూడుకోట్ల రూపాయలువస్తుంది సాలుకు. ఆమొత్తం ఆయ్నా వినోదాలకు చాలి దానంచెయ్యడానికికూడా ఉంది.

గౌరం—అక్కన్న మాదన్నల కథయేమి ?

సాదత్—వీళ్లు ఏజీన్ సర్కార్. చాలాబుద్ధిమంతులు. లోకంలంతా అదేమాట. చాలా నమ్మకం ఉంది తానాషా సుల్తాన్‌కు వీళ్లమీద. పైసాలించతయ్యరు. సుల్తాన్‌కు దేవుళ్లాగాచూస్తారు, జనులనీ బిడ్డలలాగ కాపాడ్తారు, తాము బానిసలలాగ పని చేస్తారు. పాతమంత్రులు సుల్తాన్‌కు ఏ సమాచారం చెప్పిందిలేదు. వీళ్లు సుల్తాన్‌కు చెప్పకుండా ఏపనీ చెయ్యరు.

గౌరం—వీళ్లవల్ల ఊరు, దేశంగీశం బాగుపడిందా ?

సాదత్—ఓ! చాలా బాగుపడింది హుజూర్. మాదన్న మంత్రి ఐనవెంటనే దేశమంతా బాగాచేసినాడ్. మొదటిపని దొంగలను మూలమూలలూ వెతికి శిక్షించి పైరుపంటలుకాపాడి రైతులకు మంచి చేసినాడు. రెండోపని జనులనుంచి డబ్బుగుంజే జమీందార్లను సుంకాధికారులను లాగివేసి మంచివాళ్లను వారి స్థానంలో అధికార్లుగా వేసినాడ్.

గౌరం—వీళ్లు పన్ను ఎట్లా వసూల్ చేస్తార్.

సాదత్—మాదన్నమంత్రి పంతులు అన్ని సుభాలలోను గ్రామగ్రామంగా తనిఖీచేయించి వివరంగా పన్నువసూల్ పట్టీలు ఆయాసంవత్సరాలకు ప్రత్యేకంగా తయారుచేయిస్తూ ఉన్నాడు.

గౌరం—ఊం. తర్వాత.

సాదత్—ఇందుచేత జనులకు చాలానెమ్మది ఉంది. ఇనాములు, అగ్రహారాలు, వగైరా పరిపాలనలో అక్రమాలు మాన్పినాడు. అన్నిటికంటె ముఖ్యంగా హిందూ ముసల్మాను భేదము

ఎంతమాత్రం రాకుండా అందరికీ సమానంగా చూస్తాడు. ఒక్క ఆశ్చర్యం జహాపనా!

ఔరం—ఏమి ఆ మహాశ్చర్యం!

సాదత్—హిందువులు ముసల్మానులు అంతా కలిసి 'మేం ఆంధ్రులం, మేం ఆంధ్రులం' అని ఎగురుతారు హుజూర్. వీళ్లకి దేశాభిమానం, భాషాభిమానం చాలా జాస్తి. ముసల్మానులు సంస్కృతంలో తెల్గులో బడా బడా కవులు ముష్షీలు ఉన్నారు. వాళ్లను హిందువులు నెత్తినపెట్టుకొని ఊరేగుతున్నారు హుజూర్.

ఔరం—ఇదంతా పోనీ. శత్రువులు దండువస్తే దేశానికి ఏమి కాపదల వుంది?

సాదత్—ఆహా! బాగా అడిగినారు జహాపనా. అదే తక్వా. ఇంతపెద్ద గోల్కొండరాజ్యానికి మంచి రక్షణలేదు. దీన్కి ఉత్తరభాగం మనం జయించినరాజ్యానికి ఆనుకొని ఉండే విశాలమైనమైదానం. ఈ మైదానంలో పర్వతాలుగాని ఎడారిగాని నదిగాని ఎట్వంటి అడ్డంగాని లేదు. ఎంతకాలం బిజాపూరు స్వతంత్రరాజ్యంగా ఉంటుందో అంతకాలం గోల్కొండకీ ఫర్వా లేదు.

ఔరం—అచ్ఛా. మనం మొదట బీజాపూరు జయించి తర్వాత గోల్కొండమీదికి పోతాం.

సాదత్—జహాపనా, ఇంకొకటుంది. తానాషాసుల్తాన్ రహస్యంగా బిజాపూర్ సుల్తాన్కు సహాయంచేస్తాడు. మాదన్న

పంతులు బిజాపూరుకు సిబ్బందినిపంపుతాడు, డబ్బుయిస్తాడు. పైకి తెలియకుండ మనఫౌజుకి అపకారంచేస్తాడు.

ఔరం—బుద్ధిహీనుడు, చెడిపోతాడు.

సాదత్—ఇప్పుడు మాదన్నా కొత్తసని ఆరంభించినాడు హుజూర్. మనశత్రువు శివాజీకి సహాయంచేస్తున్నాడు. శివాజీకి మాదన్న పంతులకీ జాబులు జవాబులు నడుస్తున్నవి.

ఔరం-హుం! శివాజీ. వాడికి జీయేమి? వాడికథాయేమి?

సాదత్—హుజూర్, శివుడు పట్టాభిషేకం అయింతర్వాత అతని ఖజానా ఖాళీఅయింది. తర్వాత ఆదిల్‌షాహి రాజ్యాన్ని చాలా దోపిడీచేసినాడు. ఎక్కడా లూటీ విస్తారందొరకలేదు. ఇతనికి భయపడి చాలా వ్యాపారస్థలాలు మనరాజ్యంలో పారిపోయినవి. ఆంధ్రదేశం ద్రావిడదేశం ఇంకా శివుడికి కంటిలో పడలేదు. పారం ఇక్కడిజనులు నిరాడంబరంగా ఉండే ఆమాయకులు. ఇక్కడిరేవు పట్టణాలు చాలాకాలంగా వ్యాపారం బాగాచేస్తున్నవి. ఎంతడబ్బైనావుంది. బంగారు, వెండి, జవాహరి, పట్టుగుడ్డలు, దేవాలయాలు, దానధర్మాలు, ఉత్సవాలు —వీటికి తక్కువలేదు. ఈదేశం ఆడవాళ్లు ఒక్కొక్కరు కొన్ని మణుగులు నగలుమోస్తూ తిరుగుతారు. సర్కార్ ఆశివుడి కన్నంతా ఈదేశంమీదనే ఉంది.

ఔరం—ఇందుక్కు మాదన్నా ఏంచేస్తాడు?

సాదత్—కనిపట్టినాడు బడామంత్రి శివుడిఆలోచన. ఆ మరాఠానాయకుడితో భాయిభాయి స్నేహంచేస్తాడు. వాడికీ

తానాషాకు సంధిచెయ్యడానికి ఉన్నాడు. దక్షిణదేశం జయించ డానికి మహారాష్ట్రులకి డబ్బుఇచ్చి సహాయంచేసి, వాళ్లకి లూటీ అంతా వదిలివేసి దేశం తానుమింగడానికి చూస్తున్నాడు.

ఔరం—అచ్ఛా! అచ్ఛా! శివుడికి మంచికాలం. మన సైన్యాలు ఇప్పుడు పంజాబ్‌లో ఉన్నవి. వాటిని పిలిపించి దక్కన్ పోవడాన్కి ఒకసంవత్సరం ఔతుంది. కానీచూస్తాం. జయించనీ, శివుడు ఎక్కడికి పోతాడు, గోల్కొండా ఎక్కడికిపోతుంది, మాదన్నా ఎట్లా తప్పించుకొనిపోతాడు. వీళ్లసంపదని సఫాయిచేసి గోల్కొండా నాశంచేస్తానుచూడు. సాదత్ ఖాన్‌భాయి, మీరు మళ్లీ గోల్కొండాకిపోయి అక్కడిసంగతులు సీదామాకి రాయండి. మేం తయార్‌గా ఉంటాం.

సాదత్—హుజూర్ ఆజ్ఞ.

[ఇరువురు వచ్చినమార్గములనే నిష్క్రమింతురు.

---

# దృశ్యము ౫

తానాషాసుల్తాన్ మందిరము.

[తానాషా అక్కన్న మాదన్నలు ప్రవేశింతురు]

తానాషా—మాదన్న పంతులుగారూ మీకు చాలవ్యవహార సామర్థ్యం ఉంది. మీవంటివారు మాకు మంత్రిగారావడం అల్లాకటాక్షం. శివాజీగారు చాలాగొప్పవారు, సరసులు, విశాల హృదయులు. అటువంటివారితో సంధికుదిర్చి మొగలాయీలను ఈవైపు తలయెత్తకుండా చెయ్యండి. మరి మీరు ఇద్దరూ పరి

వారం సిబ్బంది ఫౌజ్ వగైరాతోపోయి వారికి మర్యాదలతో పిలుచుకొనిరండి.

మాదన్న—చిత్తము మహాప్రభూ. నేనును మాయన్నగారునుపోయి శివాజీమహారాజుగారిని ఎదుర్కొని మర్యాదలతో పిలుచుకొనివచ్చెదము. ఈలోపల ఒకమనవి.

తానాషా—చెప్పండి పంతులుగారూ.

మాదన్న—మహలమునకు, శివాజీగారు వచ్చినతర్వాత అంతరంగిక సంభాషణకు అవకాశము ఎట్లుండునో కాబట్టి మనవి. మొగలాయీలు ప్రస్తుతము బిజాపూరు మీదికి దండెత్తియున్నారు. బిజాపురములో భలోల్‌ఖాన్ క్రొత్తమంత్రి. నేను శివాజీగారికిని భలోల్‌ఖానుకును సంధి కుదిర్చితిని.

తానాషా—సెబాష్. మీరు అసాధ్యులు!

మాదన్న—బిజాపురమువారు శివాజీకి మూడులక్షల రూపాయలు బహుమతిగాను, బిజాపురము తూర్పువైపు కృష్ణాతీరపుటెల్లను శివాజీగారు కాపాడుటకును మొగలాయీలను తరుముటకును సంవత్సరమునకు లక్షరూపాయ లిచ్చునట్లును ఒప్పించితిని.

తానాషా—అచ్ఛా, చాలామంచిపని.

మాదన్న—శివాజీ ఎక్కువకాలము ఈనిబంధనలకు లోబడడని నాకు తెలియును. అతడు తాత్కాలికముగా మాత్రమేఅంగీకరించియున్నాడు.ఉండనిండు. మొగలాయీలలో కలిసియుండి ఇప్పుడు లేచివచ్చి ప్రాయశ్చిత్తముచేసికొని కొందు

పైనవాడు నేతాజీఫాల్కర్ శివాజీతో చేరియున్నాడు. వీరందఱు చాలబలవంతులు. ఈమహారాష్ట్రులను మొగలాయీలమీఁదికి ఎసఁగొల్పుటయే మనకు మంచిది.

తానాషా—మంచిది పంతులుగారూ, మీమాట మాకు వేదవాక్యం. మీచిత్తంవచ్చినట్లు చెయ్యండి.

మాదన్న—దక్షిణదేశమును శివాజీ జయించుటకు దినమొకటింటికి మూఁడువేలహొన్నులు లేదా నాలుగునరలక్షరూపాయలు నెలనెలకు ఇచ్చునట్లును, మన సేనాధిపతి మీర్జామహమ్మద్ అమీన్‌గారి నాయకత్వముక్రింద వేయిగుఱ్ఱపుదండును నాలుగువేల కాల్బలమును పంపునట్లును ఒప్పుకొంటిని. కొంత తుపాకులు ఫిరంగులు వానికి కావలసిన మందుసామానులు—వీని కొఱకు, ఒప్పుకొన్న ద్రవ్యము కొన్నినెలలది ముందుగానే ఖర్చులకు శివాజీ అడిగినాడు. ఒప్పుకొంటిని. ఇందుకు బదులుగా శివాజీ మనకు దక్షిణదేశమునుజయించి, పూర్వము తనతండ్రి షాజీగారికి చెందని రాజ్యములన్నిటిని ఇచ్చునట్లు ప్రమాణముచేసినాడు.

తానాషా—చాలమంచిది.

అక్కన్న—శివాజీకి స్వయముగావచ్చి మన గోలకొండ వైభవమును చూడవలయునని ఆశగానున్నది. ఆయన రాయబారి ప్రహ్లాదనిరాజీ నాతో చెప్పినాడు. మేము అడిగితిమి—అఫ్ఝుల్‌ఖాన్ సంగతివిన్నవారికి శివాజీ అన్న చాలభయమని. ఆమాటకు ప్రహ్లాదనిరాజీ—'తానాషా సుల్తాన్‌గారు చాల దొడ్డవారు. వారివిషయములో శివాజీగారు ఎంతమాత్రము ద్రోహముచేయరు' అని ప్రమాణము చేసినాడు.

మాదన్న—అవును శివాజీయే ప్రమాణము చేసి యున్నాడు. ఏలినవారు నిర్భయముగా ఏకాసనమందు శివాజీతో కూర్చుండవచ్చును. అతనికి శత్రువులు మొగలాయీలుగాని దక్కనీలుగారు.

తానాషా—చాలా సంతోషం. మీరుండగా మాకేమి ఫర్వా లేదు.

మాదన్న—పైగా శివాజీతో ముఖాముఖిగా మాట లాడుటవలన మనకు చాల అనుకూలములున్నవి.

తానాషా—మంచిది పతులుగారూ మీరుపోయి వారిని త్వరగా పిలుచుకొనిరండి. మేము తయారుగా ఉంటాం. మరి ఎప్పటికప్పుడు మాకు మీసంగతి చెప్పడానికి మనుష్యులను ఏర్పాటు చెయ్యండి.

అక్కన్న—ఇప్పుడే ఏర్పాటు చేయించెదము.

ఇరువురు—మఱి మాకుసెలవు. సలాం సలాం.

[అని నిష్క్రమింతురు.

తానాషా—ఎవరురా అక్కడ ?

దౌవారికుడు—[ప్రవేశించి] సలాం సర్కార్, ఏమి హుకుం.

తానాషా—శివాజీమహారాజ్ వస్తారు. ఊరంతా అలంకారంచేసి వేడుకలు చేయించవలసిందని మా ఆజ్ఞ.

దౌవారి—హుజూర్ శెల్వు.

తానాషా—మా ఫౌజ్‌దార్ అబ్దుల్‌రజాక్ లారీగారిని పిలుచుకొనిరా.

దౌవారి—చిత్తం హుజూర్. [అని నిష్క్రమించును.

[తానాషా లోపలికి పోవును.]

---

# దృశ్యము ౬

వీథి.

[దండోరావాడు దండోరావాయించుచు ప్రవేశించును]

దండోరా—[డమ డమ డమ] ఈవేళ సాయంత్రం గోలకొండలోపలికి మహారాష్ట్ర ప్రభువు శివాజీమహారాజులుంగారు సకల సన్నాహాలతో వస్తావున్నారు. వారికి మన మహామంత్రులు ఎదురుపోయి అన్నగారివాలతో పాటి తీసుకొస్తున్నారు. ఊరంతా అలంకారం చెయ్యవలసింది హో!

[డమ డమ డమ డమ అనుచు నిష్క్రమించును.

---

# దృశ్యము ౭

తానాషా దర్బారు.

[తానాషా అబ్దుల్ రజాక్ లారీయు ప్రవేశింతురు]

తానాషా—రజాక్ భాయి శివాజీగారు ఇప్పుడు ఎంత దూరం వచ్చివుంటారు.

ప్ర. నివేదకుడు—[ప్రవేశించి] సలాం సర్కార్. అక్కన్న మాదన్న పంతులుగార్లు శివాజీమహారాజ్‌కు ఎదురుగా ఆలుమైళ్ళు

దూరంపోయినారు. యాభై వేల సైన్యంతో మహారాష్ట్రులు గోలకొండలోపలికి వస్తున్నారు. సలాం. [నిష్క్రమించును.

తానాషా—అచ్ఛా.

ద్వితీయ. నివే.—[ప్రవేశించి] సర్కార్ సలాం. మాదన్న పంతులుగారిని శివాజీగారు చాలమర్యాదచేసినారు. 'మాసుల్తాను గారు స్వయంగా మీకు ఎదురువచ్చి మర్యాదచేసి పిలుచుకొని పోవలెనని ఉన్నారు' అని మన పంతులుగారు చెప్తే శివాజీమహారాజాగారు చెప్పినారు, 'తానాషా సుల్తాన్వారు చాలా గొప్పవారు, నాకంటె పెద్దవారు, నాలాంటి చిన్నవానికి వారు ఎదురు రాకూడదు, మేమే వస్తాం.' అని పలికినారు.

రజాక్—అచ్ఛా, సెబాష్. [ద్వితీ. నిష్క్రమించును.

ప్రథ—సలాం సర్కార్. శివాజీగారికోసం ఆరుమైళ్ల దూరంనుండి హైదరాబాద్ అలంకారం చేసినారు. వీధులు సందులుగొందులు అంతా శుభ్రంగా చేసినారు. ఆడవాళ్లు ముగ్గులు పెద్దపెద్దవిగా పెట్టి, కుంకుమ పసుపు గైరా పోసిచల్లి రంగులు రంగులుగా చిత్రించేసినారు. నాలుగువీధులు కలిసేచోటులలో పెద్దపొడుగు గడలుకట్టి దర్వాజాలుచేసి వాటికి మన జెండాలు కట్టి తోరణాలు కట్టినారు. వాటికిపైన జిగినా, కాకిబంగారు రేకులు, రంగురంగు కాకితాలు, పట్టుగుడ్డతునకలు అంతా అతికించి, కుట్టి, కట్టి తళతళ మెరిసేలాగ పనిచేస్తున్నారు.

తానా—అచ్ఛా, అచ్ఛా. [సిఫాయి నిష్క్రమించును.

ద్వి—[ప్రవే] సలాం సర్కార్. శివాజీమహారాజా వస్తారని ఊరంతా దండోరా వేయించినారు. జనులంతా హిందువులు

ముసల్మానులు మంచిమంచి దుస్తులు వేస్కొని వీధుల్లో, బజార్లో, మేడలమీదా, గోపురాలమీద, దర్వాజాలమీద నిలిచి ఎదురు చూస్తావున్నారు. దూరం గ్రామాలలోనుంచి మూటకూళ్లు కట్టుకొని గుంపులుగుంపులుగా పల్లెజనం తర్లివస్తావుంది.

తానా—అచ్ఛా. [ద్వి. నిష్క్ర.

ప్రథ—[ప్రవే.] కిటికీలలో అంతా హిందూ ఆడవాళ్ల మొగాలుతప్ప వేరేలేదు. పద్మపద్మ ఒకపు అరా పిల్లకాయలూ వుంది. ఇరవై నలభై చంద్రులు ఒకచోట గుంపుగావుంటే ఎట్లా వుంటుంది, అట్లావుంది ఒకొక్కకిటికీ. [ప్రథ. నిష్క్ర.

ద్వి—[ప్రవే] సర్కార్, మహారాష్ట్రసైన్యం మన గోల్కొండామే ప్రవేశించి వస్తావుంది. ఏమి అలంకారం వున్నారు సర్కార్ వాళ్లు, వాళ్ల ఆభరణాలు, వాళ్ల రంగుల పట్టుచొక్కాయలు, వాళ్ల కిరీటాలు, తలపాగాలు, బంగారు, రత్నాలు, జలతారు వస్త్రాలు, ఉడుపులు. కళ్లుచెదిరిపోతావుంది హుజూర్. ఇదంతా మన తెలంగాణావారికి వేడుకగా వుంది. జనమంతా తోసుకొని మీదమీదపడి చూస్తున్నారు సర్కార్. [నిష్క్ర.

తానా—అచ్ఛా.

[లోపల బాకాలుదూరమున వినబడును.

తృతీయుడు—[ప్రవే] సలాం సర్కార్, యాభైవేల మహారాష్ట్రసైన్యం మన గోల్కొండవీధులలో నడుస్తా వుంది. "ఈ సైన్యమేకదా ఢిల్లీపాదుషాకు పక్కలో బల్లెంగావుంది! వీళ్లే కదా రెండుసంవత్సరాల్ కిందా ఏతగిరిని లూటీకొట్టి హైదరా

బాద్ షాకొచ్చి వాపస్ పోయిన వాళ్లు!" అని జనమంతా గలగల మాటలాడుకొంటూ చూస్తూ వున్నారు.

తానా—అచ్ఛా. [తృతీ-నిష్క్రమి.

ప్రథ—[ప్రవే] సలాం సర్కార్, మరాటా గుఱ్ఱపుదండు ఖడం తొక్కుతూ మొదట వస్తూవుంది. వాళ్లకి వెనకాలా మావలీ వీరుల కాల్బలం వస్తూవుంది. ఈ కాల్బలంలో దళనాయకులు చాలా గొప్పవారు—హమ్మీరరావు మోహితే, ఆనందారావు, మానాజీమోరే, సూర్యాజీమాల్సురే, ఎశాజీకంక్, వీళ్లకి వెనక శివాజీమహారాజాగారి ప్రతీహారి సోనాజీనాయక్; ఆయనవెనక బాబాజీబంధేరే, ఆయనవెనక శివాజీగారి అంగరక్షకులు వస్తార్. సర్కార్ వాళ్లవిశాలమైన నెత్తి, నల్లని కనుబొమలు, నెత్తి మీద బాగాలాగిన చందనంగీరలు, మధ్యనడిమి కుంకుమబొట్టు, ఆ మీసాలు, దాడీలు చాలా సజ్జాగా ఉన్నవి సర్కార్.

తానాషా—అచ్ఛా.

ప్రథ—వాళ్లవెనకా రఘునాథ్ హనుమంతె, ఆయన తమ్ము జనార్దనహనుమంతె, ప్రహ్లాద్ నిరాజీ, తర్వాత కవీశ్వరుడు దత్తాజీత్రింబక్, కేశవపంత్, నీలో మోరేశ్వరరావు, గంగాధర పంత్ గుఱ్ఱాలమీద వస్తూవున్నారు. [నిష్క్రమి.

ద్వితీ-[ప్రవే] వాళ్లవెనక సర్కార్, కాయస్థులు వస్తారు. సామాన్యవేషం వాళ్లది. బలేవ్రాతగాడంటూ నీలప్రభు, కావ్యపర్ని బాలాజీ అప్జీ, రాజముద్రికాధారి శామ్‌జీనాయక్ వస్తారు. [నిష్క్రమి.

తృతీ—[ప్రవే] సర్కార్ సలాం, శాంభాజీనాయక్ పెన్నా- శివాజీమహారాజ్ వస్తారూ సర్కార్ గుఱ్ఱంమీద. దాపువేసీలాగి సట్లు లక్షలుజనాలు టక్ అని ఆయనవైపు చూడడం మొదలు పెట్టినారు. ఆయనే శివాజీ, కాదు, అవును, ఆయనే, ఆయనే, ఆహా ఆయనేరా, అని ఎక్కీతొక్కీ చూస్తారు జనం. ఆయనచుట్టూ మహామంత్రులు సేనాధిపతులు ప్రభువులు కాపలాకాస్తారు. శివాజీ మహారాజాకు కుడివైపున అక్కన్నగారు ఎడమవైపున మాదన్న గారు వస్తూ ఊరంతా చూపిస్తూ మాట్లాడుతూ వస్తున్నారు. ఆయన సన్నగా చిక్కిపోయి ఉన్నారు సర్కార్. మూడువందల మైళ్లు ప్రయాణం వచ్చినందువల్లా, ఈమధ్యనే ఏదో ఖాయిలాపడి తేరుకోవడంవల్లా చాలా బలహీనంగా ఉన్నారు. అయినాగాని ఆయన ఇట్లాఅట్లా చూస్తా వస్తావుంటే ఆ నేత్రాలలో ఏమికాంతి సర్కార్! ఏమితీక్ష్ణం సర్కార్! ఆయనశక్తి అంతా ఆయన కంటిలోవుంది. ఆచూపు కట్టాకత్తిలాగ గుచ్చుకొంటుంది సర్కార్. ఆయనముక్కు, ఆమీసాలు, ఆరూపం చూస్తే భయంవుంది సర్కార్. [నిష్క్ర].

[లోపలనుండి 'శివాజీమహారాజ్ కు జై' అని అరుపులు]

ప్రథ—[ప్రవేశించి] మన హిందువులు, ఆడవాళ్లు పిల్లకాయలు ఆయనమీద పువ్వులవాన కురిపిస్తారు సర్కార్. ముసలిముత్తైదువలు హారతులు తీస్తారు. శివాజీగారు దోవ అంతా బంగారం వెండి చల్లుతూవస్తాడు. హారతి ఎత్తినవాళ్ల దగ్గర నిలిచి దండంపెట్టి వరహాలు వాళ్లపళ్లెంలో పోస్తాడు. అక్కా అక్కా మన

సుబేదారులకీ చూచి వాళ్లకి మంచి మంచి దుస్తులిచ్చి గౌరవం చేస్తాడు. ఆయన పోషింరత్నాలు రక్తంలాగా ధూరాన్కి కన్పడ్తుంది. [నిష్క్రమించును.

[దూరమున బాకాలు ఊదుదురు.

తృతీ—[ప్రవేశించి] సర్కార్ ఉరేగింపు బాద్‌షాహల్ దగ్గరికివచ్చి నిలిచింది. అందరు వాళ్లవాళ్ల చోట నిలిచి ఉన్నారు. శివాజీమహారాజాగారి ఉద్యోగస్థులు ఇద్దరు మనమంత్రులు మాత్రం నగర్లోకి వస్తావున్నారు. [నిష్క్రమి.

[తానాషా రజాక్‌లు లేచి నిలిచియుందురు.

[లోపలినుండి—మహారాజాగారు ఇటురండి, ఇటురండి. వారే మా సుల్తాన్వారు, మహారాజా]

[అంతట మాదన్న శివాజీ వారివెనుక అక్కన్న అతనివెనుక ఇరువురు మహారాష్ట్రనాయకులు ప్రవేశింతురు.

తానాషా—చాలాసంతోషం, అన్నగారూ ఇక్కడ ఇక్కడ [అని శివాజీని కౌగిలించుకొని తనప్రక్క కూర్చుండబెట్టుకొనును. అక్కన్న మాదన్న రజాక్ తానాషావైపు, మహారాష్ట్రులు శివాజీవైపు నిలిచియుందురు.]

తానాషా—చాలాసంతోషం. మీపేరు, మీకీర్తి ఇంత వరకువిన్నాం. ఇప్పుడు మిమ్ము స్వయంగాచూచినాం. మాది చాలా పుణ్యం.

శివాజీ—చాలా సంతోషం, చాలాసంతోషం, సుల్తాన్ భాయి మా అదృష్టం పండింది తమదర్శనంచేత.

మాదన్న—శివాజీమహారాజుగారు ఇంత మంచివారని ఇంతసులభులని మేము కలలోకూడ అనుకొనలేదు. అఫ్‌ఝల్ ఖాన్ సంగతి విన్నప్పుడు మాగుండెలు ఝల్లుమన్నవి. ఎంత భయము !

శివాజీ—ఎందుకు భయం పంతులుగారూ ? ధర్మాన్ని చూస్తే అధర్మం భయపడి పారిపోవలెను సుల్తాన్‌భాయి.

నేతాజీఫాల్కర్ (ఒక మహారాష్ట్ర నాయకుడు)–సుల్తాన్ భాయి. మారాజాగారివల్ల తప్పు లేదు. వాళ్లు ద్రోహబుద్ధితో వచ్చినారు. దానికిబదులు మారాజాగారు బుద్ధిచెప్పినారు.

తానాషా–[అందఱను చూచి] కూర్చోండి స్నేహితులూ కూర్చోండి. [అందఱు కూర్చున్నతర్వాత] మీవంటివారు ఉండడంచేతనే ఢిల్లీపాదుషా ఒకహద్దులో ఉన్నాడు.

శివాజీ—ఢిల్లీపాదుషా ! వాడు ఎంతనీచుడు. నాకు ఎన్ని వాగ్దానాలుచేసి ఎగవేసినాడు. ఈ మొగలాయీలకంటె అల్పులు వేరలేరు సుల్తాన్‌భాయి.

[నౌకరులు తట్టలలో తాంబూలము పన్నీరు తెచ్చి యుంతురు. తానీషా శివాజీకి చల్లును. మాదన్న మిగిలినవారికి చల్లును.

తానాషా—పాదుషాను సభలో ధిక్కరించిన మీ ధైర్యం చాలాగొప్పది.

శివాజీ—నాకు నిజంగా చాలా ఆయాసమైందండీ సుల్తాన్ భాయి. రాజా జైసింగ్ వగైరాలు నాకుచేసిన వాగ్దానాలకు

పాదుషా దర్బార్‌లో చేసినదానికీ ఏమీ సంబంధంలేదు. నాతో సంధిచేసుకొని మర్యాదతో పిలుచుకొనిపోయి మహారాజాగా నన్ను ఒప్పుకొని ఇదోతరగతి కుంకలమధ్య నన్ను కూర్చోపెడితే ఊర్కే ఉంటానా? ఈ మోసానికి నేను ఆయాసపడుతూఉంటే పాదుషా ఏమైనా కదలుతాడా! వీరి బంధిఖానా ఎంత! వీళ్ల జాగ్రత ఎంత! నిమిషంలో వీళ్లకళ్లలో దుమ్మువేసి వచ్చినాను సుల్తాన్ భాయి.

తానాషా—సెబాష్! సెబాష్! మీశక్తిసామర్థ్యం ఎవరికివస్తుంది. అవంతా దేవుడి అనుగ్రహం అన్నగారూ. మరి మాదన్నపంతులుగారూ శివాజీఅన్నగారిని పిలుచుకొనిపోయి వారికి ఖుషీగా అన్ని సదుపాయాలుచేసి ఉపచారం చేయించండి. చాలాదూరం ప్రయాణంవచ్చి శ్రమపడి ఉన్నారు. కొంచెం విశ్రాంతి తీసుకొని కాగానే వినోదాలు చూడవచ్చును. అన్నగారి యిష్టంప్రకారం చేయండి.

[తానీషా శివాజీని కౌగిలించుకొని పోవుచుండును.
ఇతరులు సలాములు [illegible]

---

# దృశ్యము ౫

## గోలకొండలో.

[ఢిల్లీవారి రాయబారి సాదత్ ఖాను విడిది.]

సాదత్ ఖాన్—[ఆలోచించుచు] శివాజీ గోలకొండకు వచ్చినసంగతి పాదుషాగారికి నేనువ్రాసి మూడునెలల్ ఐనవి

కదా. పాదుషాగారు ఇంకా హుకుం పంపలేదు. ఏమికారణం వుండును.

సిఫాయి—[ప్రవేశించి] సర్కార్ సలాం. శివాజీ గోల్కొండా వచ్చినసంగతి ఢిల్లీలో పాదుషాగారికి తెలిసిపోయింది. వారికి చాలాకోపంవచ్చి బిజాపూరుమీద లడాయిచేస్తున్న మన బహదూర్ షాగారిని సేనాపతి నౌకరీనుంచి లాగివేసి వారికిబదులు దిలిరుఖానుగారిని పెద్దఫౌజ్ తో పంపించినారు.

సాహబ్—ఆహా!

సిఫాయి—మార్ఖేడ్ దగ్గర మనవాళ్లకి గోల్కొండ ఫౌజుకి గొప్పలడాయి అయింది. మనఫౌజంతా నాశం.

సాహబ్—శివాజీ కథాయేమి ?

సిఫాయి—సర్కార్, ఇక్కడినుండి బయల్దేరిపోయిన శివాజీ దక్షిణదేశంలో నూరుకోటలు పట్టినాడు. గొప్పగొప్ప కోటలు, చెంజి, వేలూరు, ఆయనకు లొంగిపోయినవి. తనసిబ్బంది అక్కడ కావలాపెట్టి ఆయన మైసూరు, కొప్ప, గదగ్, ధార్వార్, బెల్గామ్ వగైరాలుకూడా జయించి బంగారు వెండి లూటీ విస్తారం తీస్కొని ఊరుపోయిచేరినాడు సాబ్.

సాహబ్—అయితే మన మాదన్నగార్కి ఎగనామంవేసి నాడా శివాజీమహారాజ్ ?

సిఫాయి—సర్కార్ మోసంచేసినాడు శివాజీ మాదన్నా పంతుల్ని. ఆయన గోల్కొండవార్కి చేసినప్రమాణం ఒకటికూడా చెల్లించలేదు. తాను కొట్టినలూటీ అంతా తానే తీస్కొనిపోయి

నాడు. తాను జయించిన భూమిని కూడా తన స్వాధీనంలోనే పెట్టుకొన్నాడు. తానాషా సుల్తాన్ మదన్నా మంత్రి యిప్పుడు ఆలోచన చేస్తున్నాడు—ఏమిచేస్తాం అని.

సాహత్—బలే! బలే! నేను ఈసంగతి అంతా పాదుషా గారికి ఈదినమే వ్రాసిపంపిస్తాను. ఇంక గోల్కొండా మాకీ ఏక్ లాహరా.

సిపాయి—తానాషా సుల్తాన్ బిజాపూరును కాపాడవలెనని పనిచేస్తుంటే ఇప్పుడు శివాజీ లంచమిచ్చి బిజాపూరును తాను స్వాధీనం చేసుకోవడానికి పైయెత్తు వేస్తున్నాడు. ఈసంగతి బిజాపూరు సుల్తాన్ తానాషాగారికి జాబు వ్రాసినాడు. శివాజీ కొత్తయెత్తులు మాదన్నగారికి కష్టంగా ఉన్నవి. అందుచేతా ఇప్పుడు బిజాపూరులో కొత్తమంత్రి సిద్దిమసూద్ గారికిన్ని ఆయన శత్రువులకు స్నేహం కలుపుతున్నాడు. బిజాపూర్ సైన్యానికి మాదన్నగారే జీతాలిచ్చి వాళ్లను తిరుగుబాటు చేయకుండా కాపాడి శివాజీని కొంకణంనుంచి బయటకు రానీయకుండా ఉంచే దానికి చూస్తూ ఉన్నారు.

సాహత్—అచ్ఛా! నేను ఈసంగతులంతా ఢిల్లీకి పాదుషా గారికి రాసి పంపిస్తాను. [అందరు నిష్క్రమింతురు.

---

# దృశ్యము ౯

ఊరిబయట మసీదు.

[ఒక చెట్టుక్రింద ముసలిఫకీరొకడు ధ్యానములో నుండును.]

తానాషా—[సామాన్య వేషమున ప్రవేశించి] గురుమహరాజ్ అబుల్‌హాసన్ సలాం చేస్తున్నాను.

గురువు—[మెల్లగా కన్నులు తెఱచి] ఆహా! నాయనా, నీవా రా, ఇక్కడకిరా. ఎట్లాఉన్నావు?

తానాషా—హాయిగాఉన్నాను గురూజీ, తమదయవల్ల. తమ ఉపదేశం నేను మరిచిపోలేదు.

గురువు—నీసంగతి అంతా నేను వింటూనే ఉన్నాను. సుల్తానైనా నీవు పాతబుద్ధి చెడిపోకుండా మా హితోపదేశం ప్రకారం చేయడం నాకు తెలుసును. చాలాసంతోషం.

తానాషా—గురుమహరాజ్, నాతండ్రి కోటీశ్వరుడు. నా చద్దాలుగోసంవత్సరంలో ఆయన చనిపోయినాడు. నేను కుటుంబం అప్పులు చెల్లించలేక పట్టి బికారినైనాను. తమరు నాకు బుద్ధిచెప్పి కాపాడినారు.

గురువు—అబుల్‌హాసన్ ఈ ప్రపంచం అంతా అబద్ధం. ఇదంతా మిథ్య. క్షణికం. తాత్కాలికం. ఈప్రపంచమంతా పాలించేవాడు భగవంతుడు. నిన్ను ఫకీరును చేస్తాడు, సుల్తానుగా చేస్తాడు; పల్లకీలో తిప్పుతాడు, వీధిలో నడిపిస్తాడు, పంచభక్ష్యపరమాన్నం పెడతాడు, ఉపవాసం వేస్తాడు. దేవుడు నిన్ను ఆడిస్తున్నాడునాయనా. దేనికీగాని నీవు కర్తవు కాదు. ఏది ఎప్పుడు వస్తే అప్పుడు దానినిఅనుభవించవలసింది మానవుడి విధి.

తానాషా—ఈ ఉపదేశం నేను ఎప్పుడూ మరిచిపోను. అందువల్ల నాకు మనస్సుకు చాలా హాయికలిగింది గురుదేవ్.

పద్నాలుగు సంవత్సరాలు తమశుశ్రూష చేసినానుగదా. తమ జోస్యం ప్రకారం నా ఇరవై ఎనిమిదవసంవత్సరంలో నాకు ఐశ్వర్యం వచ్చింది. తటాలునవచ్చింది. సుల్తాన్‌కు అల్లుడినైనాను. తర్వాత కొంతకాలానికి సుల్తానే ఐనాను. ఇదంతా నాస్వాధీనంలో లేకుండా నా ప్రయత్నం ఏమీ లేకుండా జరిగిపోయినవేగదా హజరత్ జీ. ఇదంతా భగవంతుడి పని అని నాకు తెలుసును గురుమహారాజ్. ఇందులో నాగొప్పతనం లేదు. ఈ ఐశ్వర్యం నాకు ఎంతకాలం ఉంటుందో తెలియదు. పోయేకాలంవస్తే అదేపోతుంది. అప్పుడు మళ్లీ అల్లాపెట్టినపని చేస్తాను. మంచికి చాలసంతోషంగాని అపాయానికి దుఃఖంగాని నాకులేదు గురూజీ.

గురువు—సెబాష్ అబుల్‌హసన్. ఎప్పుడూ ఒకటే సంతోషం. అందుచేతనే నిన్ను అంతా తానాషా అంటారు. అల్లాను మరచిపోవద్దు. నీమంత్రులు బుద్ధిమంతులు. కాని ఈదేశం చాలా కష్టపడవలసిఉంది. ఆంధ్రుడి మంచితనమే అందరికీ కన్నుకుట్టుతూ ఉంది. నీజీవితంలో ఇప్పుడు మూడవపద్నాలుగోసంవత్సరాల భాగం జరుగుతుంది. నీకు నలభై రెండుసంవత్సరాలు పూర్తి కాగానే కష్టంవస్తుంది. తర్వాత పద్నాలుగుసంవత్సరాలు కష్టపడి అల్లాకాడికి పోతావు.

తానాషా—ఆహా! గురుమహారాజ్. అంతా అల్లా కటాక్షం. [ఇరువురు నిష్క్రమింతురు.

# దృశ్యము ౧౦

## సాదత్ ఖాఁ విడిది.

సాదత్—[ఆలోచించుచు ప్రవేశించును] తానాషా చాలాగొప్పవాడు, వేదాంతి. ఆయనకు సారాయి గైరా నిషా పనికిరాదు. పెళ్లాలుతప్ప భోగం గీగం వాళ్లను దగ్గిరకి రానీడు. మర్యాదతోచేరిన భోగం అనుభవం ఆయనది. ఈయనకీగాని ఈయనమంత్రులకీగాని విషంపెట్టించడం అసాధ్యం. హిందువులకీ ముసల్మానులకీ అందరికీ సహాయం చేస్తాడు. ఈయనమీద అబద్ధం ఎలాగా ప్రచారం చెయ్యడం ?

సిపాయి—[ప్రవేశించి] సర్కార్, పాదుషావారి దగ్గర నుంచి జాబు. [అని ఇచ్చును.

సాదత్—[గ్రహించి చదువును] 'ఈతానాషా దురదృష్టవంతుడు. ఒక కాఫిర్ వానిచేతిలో రాజ్యాన్ని వదిలి గొప్ప గొప్ప సయ్యదులను, షేకులను, పండితులను వానికి లోబడి పడి ఉండేలాగ చేస్తున్నాడు. తనరాజ్యంలో ప్రత్యక్షంగా సకల పాపాలు చేస్తున్నాడు. తాగుడు, జూదము, వ్యభిచారము హెచ్చైపోయినవి. తానే స్వయంగా తాగి నిరంతరము ఆడవాళ్ల సహవాసంలో ఒళ్లుమరచి నిషాలో ఉంటాడు. రాజ్యాధికారం అనే మదంవల్ల న్యాయాన్యాయాలకు, పుణ్యపాపాలకు, ఇస్లాముకు, కాఫిర్ మతానికి భేదం తెలియకుండా ఉన్నాడు. ఆ కాఫిర్ శివుడితో స్నేహంచేస్తాడు.వీడికి ఎప్పుడూ నాస్తికులతోనే స్నేహం. భగవంతుని నియమాలను ఉల్లంఘించి ఈపాపి దేవతలకు మానవులకుకూడ చాలాదూరమైపోతూఉన్నాడు"

సిఫాయి—[ఆశ్చర్యముతో] సాబ్, ఇదంతా ఎవరండీ ?

సాహెబ్—తానాషా సుల్తాన్.

సిఫాయి—అల్లా ! అల్లా ! నిజమా సర్కార్.

సాహెబ్—కాదు. ఆయన మంచివాడే. అయితే మనం ఈమాదిరి చెప్పి ప్రచారం చేసి ఆయన పేరు పాడు చెయ్యాలా అని పాదుషాగారి హుకుం.

సిఫాయి—అరే అల్లా !

సాహెబ్—[మరల చదువును] 'నేను నిన్ను గోలకొండకు పంపినది నీవు అక్కడినుంచి రెండు పనికిరాని రాతిముక్కలు తేవలెనని కాదు.'

సిఫాయి—రాతిముక్కలు ఏమండీ సాహేబ్?

సాహెబ్—వజ్రాల్. తానాషా దగ్గర రెండు గొప్ప వజ్రాల్ ఉన్నవి. వాటిని పాదుషా రాతిముక్కలని అంటాడు. విను— 'నాకు అవి లక్ష్యం లేదు. నీవు తానాషాను ఎంతమాత్రం సంతోష పెట్టకూడదు, మర్యాదగా చూడకూడదు. నిర్లక్ష్యంగా మాటలాడుతూ జగడంలోకి దించవలెను. అతడు కోపం తెచ్చుకొని నిన్ను తిరస్కరించేస్తే వానిని ఉచ్చాటన చెయ్యడానికి నాకు అవకాశం దొరుకుతుంది. సాధ్యమైనంతవరకు తానాషాతో జగడం వేయి, సభలోగాని ఏకాంతంలోగాని అతనిని మర్యాదగా చూడవద్దు.'

సిఫాయి—అంత మంచి సుల్తాన్వారితో గట్టిగా ఎట్లా మాట్లాడుతారు సాబ్.

సాదత్—అది చాలాకష్టంగా వుంది. ఆయనకు ఏమి చేసినా కోపంరాదు.

సిఫాయి—ఏమిచేస్తాం. మనవౌకరీ మనం చెయ్యాలా సలాం. [అని నిష్క్రమించును.

సాదత్—నేను పాదుషావారికి జవాబ్ రాస్తాగా.

[అని వ్రాయుట కారంభించును.

సిఫాయి—[మరల ప్రవేశించి] సర్కార్ సలాం, అక్కన్న మాదన్నలకీ ద్వేషుడంటూ ఒకాయన, ఆయనపేరు అత్తిమత్తరావ్ చెప్తార్, వచ్చిఉన్నార్.

సాదత్—[వ్రాతనిలిపి] రమ్మను.

[సిఫాయి నిష్క్రమించును.

[అత్తిమత్తరావు ప్రవేశించును.]

అత్తిమత్త—సలాం సాహేబ్.

సాదత్—సలాం సలాం. రండి కూర్చోండి. మీ పేరు ?

అత్తిమత్త—ఆదిత్యమూర్తిరావు అని అంటారు.

సాదత్—అచ్ఛా. మీరు వచ్చినపని.

అత్తిమత్త—సాయెబుగారూ నేను మీకు కొత్తగాని మీరు నాకు కొత్తకాదు. మీరు జగత్ప్రసిద్ధులు. నేను ఒక గొప్పకార్యంమీాద తమ దర్శనానికి వచ్చాను. సాయెబుగారూ ఎక్కువమాటలు పెంచడ మెందుకు. ఈ అక్కన్న మాదన్నలు పరమదుర్మార్గులు. వీరున్నంతకాలం మీరు ఈ గోలకొండను పట్టలేరు. వీరు నాకు చాలా అపకారంచేశారు. నాకేగాదు

చాలామందికి చేసిఉన్నారు. నేను వీరిమీద పగతీర్చుకోవడానికే తమసహాయం కోరుతున్నాను. మీరు సహాయం చేయగలరా?

సాహెబ్ — మీరు మాకు స్నేహితులు అని ఏమిదాఖలా. మాకు మాదన్నగారిమీద ఏమిద్వేషం? ఎందుకు ద్వేషం? తానాషాగారు మాకుస్నేహితులుగాని శత్రువులుకారు. మీతో మాకు పనిలేదు.

ఆ స్త్రీమస్తా — మీకు నామీద సందేహము, నేను మాదన్నగారి మనిషినేమోనని. కాదు. ఎంతమాత్రంకాదు. మాదన్నగారిజాబు ఒకటి నాచేతవారికంపె అది మీకు ఇస్తాను.

[అని ఇచ్చును.

సాహెబ్ — [చూచుకొని] ఆహా! షోలాపూరులో ఉండే మా మొగలాయి సిబ్బందిని నాశంచెయ్యడానికి కుట్ర. బిజాపూరువాళ్లు గోల్కొండావాళ్లు కలిసి.

ఆ స్త్రీ — ఇప్పుడైనా నాలో నమ్మకము కుదిరిందా? ఇంకా అక్కడి రహస్యాలు మీకు చెప్తాను. మా వారిసేనాపతులలో షేక్ మిన్హాజ్ మీర్ ఇబ్రహీం మీర్ హాషీంలు మామంత్రుల మీద ద్వేషం పూనియున్నారు. ఏనిమిషంలోనో వచ్చి మీతో చేర్తారు. తానాషాగారి అంతఃపురంలో ఆడవాళ్లకు కొందఱికి అక్కన్న మాదన్నలమీద ద్వేషంఉన్నది. అబ్దుల్లాగారి, అనగా పాతసుల్తానుగారి రాణీగారైన సరోమాజనీసాహెబులకు తానాషామీద ఉండిన ద్వేషం ఈమంత్రులమీదికి తిరిగింది. హిందవులను తొలగించి మళ్లీ మహమ్మదీయమంత్రులను ఏర్పాటు

చేసుకోవలెనని వీళ్లకు కోరిక. మీరు దయవలిస్తే వీళ్లనందరిని నేను ఒకచోట చేర్పించి రహస్యంగా మాదన్న గారిమీద కుట్ర సాగించి మీకు సహాయం చేయగలను.

సాదత్ — అచ్ఛా. చాలామంచిది. మీకు మేం పాదూషా గారికి సిఫారస్ చేస్తాం. మీవంటి గొప్పవారు ఒకరిద్దరు ఉండవాలా. లేకపోతే దేశం బాగుపడదు. మరి ఇప్పటికి సెలవ్ ఇవ్వండి. మేము జరూర్ పనిలో ఉంటాం.

అత్తి మత్త — దయఉంచండి. మళ్లీవచ్చి దర్శనం చేస్తాను.
[నిష్క్రమించును.

సాదత్ — నేను లోకి లేకపోయి జాబుంచేస్తాగా. [నిష్క్ర.

---

# దృశ్యము ౧౧

తానాషా మంత్రాగారము.

[తానాషా అక్కన్న మాదన్నలు అబ్దుల్ రజాక్ లారీ,
అబ్దుల్లాఖాన్ పానీ ఉచితాసనములఁ బ్రవేశింతురు]

మాదన్న — మహాప్రభూ మనజాబులు కొన్ని సాదత్ ఖానునిచేతిలోపడినట్లు తెలియుచున్నది. అతడు పాదుషాకు తెలియబఱిచెను. పాదషా ఆగ్రహపరవశుఁడై మనరాజ్యము మీదికి దండుబంపినాడు. బిజాపురమును ముట్టడించుచున్న సేనలో కొంత మనమీదికి తిప్పినాడు. మొగలాయీలు మనమీదికి నడిగా వచ్చుచున్నారు. ఎప్పటికప్పుడు వృత్తాంతము వచ్చి

చెప్పుటకు చారులను నియమించి యున్నాను. మనసిబ్బందిని పంపియున్నాను.

ప్రథమనివేదకుడు—[ప్రవేశించి] దండం దండం మహాప్రభూ. మొగలాయీసైన్యాలు భీమానదీతీరంలో ఆగ్నేయంగా నడిచినై. గుల్బర్గా షోలాపూరుల నడుమ డెబ్బైమైళ్లు మొగలాయీల స్వాధీనంలో ఉండడంవల్ల సులువుగా నడకసాగింది. తర్వాత కొంత మందగించింది. మొగల్ సేనాపతి ఖానీజహాన్ ముందుగా కొంతసైన్యంతో మాల్ఖేడ్ కోటను సమీపించారు. పాదుషాగారి కుమారుడు షాఆలంగారు మూడు నాలుగు ప్రయాణాలు వెనకబడి ప్రయాణించినారు. అప్పట్లో రెండుసైన్యాలమధ్య 25 మైళ్లు దూరం. సేనాముఖ్ టీకంగా కొంతసైన్యంతో జాన్‌నిసార్ ఖాన్‌గారు పోతూవచ్చారు. పిల్లంపిరూ మాల్ఖేడుకు తూర్పుగా దాదాపు ఎనిమిది మైళ్లదూరం చేరగానే మన గోలకొండఫౌజు నల్భైవేలుమోతలు ఎల్బైవేలనరకూ ఉండవచ్చును—మొగలాయీలను ఎదుర్కొన్నది. గొప్పయుద్ధం జరుగుతున్నది మహాప్రభూ. [నిష్క్రమించును.

తానా—ఆహా! పంతులుగారూ, మీరు ఎప్పుడో ఎదురుచూచిచెప్పినవి ఇప్పుడు జరుగుతున్నవి. మన మెంత జాగ్రతగా ఉన్నప్పటికిన్నీ దైవం సహాయం చేయవలసి ఉంది.

ద్వితీయనివేదకుడు—[ప్రవే]దండ దండం మహాప్రభూ. గోలకొండసేనాపతులు మీర్ మహమ్మద్ ఇబ్రహీం, మీర్ హాషీం మన మహామంత్రిగారి మేనల్లుడుగారు రుస్తుంరావుగారు, నడు

వుతున్నారు. మనగుఱ్ఱపుసైన్యం మొగలాయీవారిని చుట్టవేసి కొన్నది. అతి కష్టంమీద పోరాడి మొగలాయీలు దాన్ని జయించారుగాని వారికడక చెడిపోయింది. జాన్‌నిసార్ ఖాన్ మాళ్ఖేడుకు వారసిపోయి అక్కడినుండి యుద్ధం చేస్తున్నారు.

[నిష్క్రమించును.

ప్ర. నివేద [ప్రవేశించి] మహాప్రభో, మనసైన్యం చాలా గొప్పదిగా ఉండడంవల్ల ఖాసీజహాను తనస్కంధావారం చుట్టూ ప్రాకారాలేర్పరచుకొంటూ ఉన్నారు. వారిగతి మాళ్ఖేడులోనే ముట్టడిపడినట్లుంది. వారు అత్యంత ప్రయత్నాలు చేస్తున్నారు.

[నిష్క్రమించును.

తృ. నివేద—[ప్రవేశించి] సర్కార్ సలాం, పాదుషా గారి కుమారుడు షా ఆలంగారు మాళ్ఖేడ్ నగరికి వచ్చినార్. బైటినుంచి మనసర్దార్లకి రాయబారం పంపినార్. 'తానాషాసుల్తాన్ గారు వచ్చికోరితే మేము పాదుషాగారికి సిఫారసు చేసి వారిని వదిలివేస్తాం' అని. మన సర్దార్లు కోపంవచ్చి 'మేం జయించినాం. మాదిపై చెయ్యి. మీకు లొంగే గ్రహచారం మాకేమి?' అని తిర్గ కొట్టినార్.

[నిష్క్రమించును.

ద్వి. నివేద—[ప్రవే] మహాప్రభో హైదరాబాదు ప్రవేశించడానికి రహస్యమార్గాలు వెతకడానికి మొగలాయీలు గూఢచారులను చాలామందిని పంపినారు. వారు మారువేషాలతో తిరుగుతున్నారట.

మాదన్న—ఫర్వాలేదు. ఈసంగతిపోయి మన రుహుల్లా ఖాన్‌సాహేబ్ గారితో చెప్పు.

ద్వి. నివేద—చిత్తం. [నిష్క్రా.

తృ. నివేద—[ప్ర వే] సర్కార్ సలాం, మనవాడు బారి ఖాన్, తుపాకితో కొడితే ఎట్లా గురిగా తగులుతుందో అల్లా రాయితో కొట్టేవాడు, ఖాన్‌జహాన్ మీదికి లడాయి చెయ్య డానికి ఎగిరినాడు. ఎవరో కొట్టిన బాణంతగ్లి మర్గయా సర్కార్. [నిష్క్రా.

తానాషా అల్లా! అల్లా! మాకు నమ్మకమైన నౌకర్ వాడు!

ప్ర. నివే-[ప్ర వే]మహా ప్రభూ, మొగలాయీవారి రాజా రాంసింగ్ తనపనుగును మనవారిమీదికి ఉసికొల్పినాడు. అది దాని దంతాలకు కట్టిఉండిన మూడుమణుగుల బరువు గొలుసును విసురుతూ మనవారిమీదికి రాగానే మనగుఱ్ఱాలు బెదరి రౌతులను క్రిందికితోసి చిందరవందరగా పారిపోయినవి. మొగలాయివారు బయల్దేరవస్తున్నారు.

మాదన్న -మా సొంతగుఱ్ఱపుదళం పదివేలసైన్యమున్నది. దానిని నడుపుమని రూస్తుం రావుతో చెప్పు.

[ప్రథమనివేదకుడు నిష్క్రమించును.

తృ. నివే—[ప్ర వే] సర్కార్ సలాం. మొగలాయీలు బయలుదేరి మొదట లడాయి అయిందే అక్కడికి, ఈదినిమిది మళ్లు మళ్లీ ఆక్రమించివచ్చినారు. అక్కడ సెడంలో మట్టికోట వుంది. మొగల్ సేనాపతి జాన్‌నిసార్ ఖాన్ సెడం మట్టికోటలో చేరగానే మనసిబ్బందిలు వాళ్లను ముట్టడివేసినార్. మొగలాయీ వాళ్లు ధైర్యంచేసి తమకోటను కాపాడుకొంటున్నారు. మళ్లీ మనవాళ్లది పైచేయి వాళ్లది కిందిచేయి.

మాదన్న—ఏలినవారు మాకుసెలవిండు. మేముపోయి స్వయముగా కొంత ఏర్పాటు చేసి వచ్చెదము.

తానాషా—అచ్ఛా. అట్లాగే చెయ్యండి.

అక్కన్న మాదన్నలు—సలాం, సలాం.

తానాషా—సలాం. [మంత్రులు నిష్క్రమింతురు.

ద్వి. నివే—[ప్రవేశించి] సర్కార్ ఆయన ఎవరో అత్తి మత్తరావుగారంటూ దర్శనాన్కి వచ్చి ఉన్నార్.

తానాషా—రమ్మను. [ద్వి. నివేద. నిష్క్రమించును.

అత్తి—[ప్రవేశించి] సలాం, మహాప్రభువుగారికి.

తానాషా—సలాం, రండి. ఏమి సమాచారం ?

ప్ర. నివే—[ప్రవేశించి] దండం, దండం, మహాప్రభూ. మన ఫౌజుదారు ఇబ్రహీంసాహేబుగారు మనవాళ్లను మోసం చేసి పారిపోయి మొగలాయీలతో చేరినాడు. వెంటనే ఇంకొక ఫౌజుదారు మీర్ హాషీంగారు మనవాళ్లతో జగడమాడి మొగలాయీ ఫౌజ్ వాళ్లతో చేరిపోయినారు. పాదుషాగారి కుమారుడు షాఆలం బహద్దరుగారు వారికి మర్యాదలుచేసి పంచహాజారీమన్సబ్దార్ చేసినారు. మిన్‌హాజ్‌గారికి మహాబత్ ఖాన్ అని బిరుదిచ్చినారు. సలాము. [నిష్క్రమించును.

తానాషా—ఆహా ! ద్రోహులు పారిపోయినారు.

అత్తి—సర్కారువారు చక్కగా ఆలోచింపవలసిన విషయముగాని ఇది సామాన్యముగాదు. నేను ఇదివరలోనే మనవి చేసియున్నాను. మొదట ఇబ్రహీం పారిపోయినాడు. వెను

వెంటనే మిాసుహాషీం పారిపోయినాడు. వీ రిద్దఱును మన మంత్రులకు ఆప్తులుగదా. మాదన్నగారికి ఈసంగతి తెలియక యుండునా ముందుగా ?

తానాషా—మీారు ఇదివరలో చెప్పిన సంగతులు ఆలోచించినాం. మాకు నమ్మకం లేదు. వారిది ధర్మబుద్ధి.

అత్తి—క్షమింపుడు హుజూర్. కొంచెము ఆలోచించిన తెలియగలదు. తమకు పరమాశ్రితులు పారిపోవుట తమకు తెలియక యుండునా ? త్వరలోనే వీరును వారితో చేరగలరనుటకు దాఖలాలు గలవు. ఈజాబును చిత్తగింపుడు.

[అని యొక జాబిచ్చును.

తానాషా—[చూచుచుండును]

అత్తి—ఇది వారిదే దస్తూరి. పాదుషా స్వయముగా వచ్చినయెడల మాసుల్తాన్వారిని తమకు పట్టియిచ్చెదమని వారు స్పష్టముగా వ్రాసియున్నారు. హుజూరు చిత్తగింపుడు.

తానాషా—[అత్తమత్తుని ఒకవిధముగా చూచుచు] ఇది వారిదే అని నిశ్చయమా ?

అత్తి—ఇంకను సందేహమా ప్రభూ ?

తానాషా—ఎవరురా అక్కడ ? మా మంత్రులుగార్లను మేము చూడవలెను.

[అక్కన్న మాదన్నలు ప్రవేశింతురు]

తానాషా—సెబాష్, మీారే వచ్చినార్. ఇది చూడండి పంతులుగార్లూ. [అని ఆజాబును చూపును.

మాదన్న—[ఆ జాబునుచూచి తానాషాతో] మహా ప్రభూ మాదస్తూరి తా మెఱుగనిది కాదుగదా. ఇది మా వ్రాతయే యని తమకు తోచినయెడల తా మెట్లు శిక్షించినను మాకు సంతోషమే. [అని జాబును అక్కన్న చేతి కిచ్చును.

తానాషా—ఆజాబు ఇవ్వండి. [అని మంత్రుల నొకమారు తేరిచూచి, అత్తిమత్తరాయని నొకమారుచూచి దానిని చింపి వేయును.]

అత్తిమత్త—[చూచి, ఆశ్చర్యపడి, సలాముచేసి వెడలి పోవును.]

తానాషా—ఇది దొంగజాబు పంతులుగార్లూ. ఈ అత్తిమత్తరావు దొంగ. మీకుద్రోహి. మీకారుణ్యంవల్ల వీడికి మేం వదలిఉన్నాం. ఆ అక్షరాలు, ఆవంపులు, అభాష, ఆవక్కణ, మీది కాదు. మీరు మీప్రాణాలుకాపాడుకోకుండా అజాగ్రతగా ఉన్నారు. అతినీతికాదు. వేదాంతం వేరే, నీతి వేరే. హిందువుల మీద మాకు అభిమానం అని చాలామందికి మావాళ్లకు మా మీద ద్వేషం. మీ యోగ్యత మాకు తెల్సును. భగవంతుడి దయ ఎట్లా ఉంటుందో తెల్వదు. మనప్రాణం మనవల్ల ఐనంతవఱకు మనం నిల్పుకోవాలా, జాగ్రతగా ఉండండి.

మాదన్న—సర్కార్ వారి దయ యున్నంతవఱకు మా కేమియు లోపములేదు. మేము త్రికరణశుద్ధిగా మాయాంధ్ర ప్రభువును, మాయాంధ్ర దేశమును కొలుచుచున్నాము. మతమే మైననేమి? తాము మహాత్ములు. తమవంటి యుత్తములకు ద్రోహ

మొసర్చుపట్టి పాపాత్ములకు ఎట్టిగతి కలుగునో ఎవరుచెప్పగలరు.

తానాషా—పంతులుగారూ, మాకు అంతా తెలుసును. మతం మతమే, పరిపాలనం పరిపాలనమే. రెంటికీ ఏమిసంబంధం. హిందువైతే నేమి, మహమ్మదీయుడైతే నేమి? పెద్దమనుష్యుడు కావలెను. అంతే.

అక్కన్న—మహాప్రభూ, ఎప్పటికైనను చనిపోవుట నిజము. మాశక్తివంచన లేక దేశమును మమ్ము కాపాడుకొందుము గాని మితిమీరివచ్చిన ఎవరేమిచేయగలరు? మాకు భగవత్కైంకర్యములు చేసి దానములుచేయుటకు తాము సెలవొసంగవలెను.

తానాషా—అచ్ఛా! చాలాసంతోషంగా చెయ్యండి. పంతులుగారూ నేనుకూడా మీవలె ఆంధ్రుణ్ణే. మన ఆంధ్ర దేశానికీ, ఈశాలాంధ్రానికీ. మీరేమిచేసినా నాకుసంతోషమే.

తృ. సిపా—[ప్రవేశించి] సర్కార్ సలాం. భద్రాచలం తాసిల్దార్ గోపన్న పంతులుగారి లెక్కలన్నీ అబ్దుల్ జాక్ సాహెబ్ గారు చూచినారు. అంతా సరిగానున్నవి. అసలుతసీల్ వరహాలు దమ్మిడీ ఆయనసొంతానికి తీసకుండా దేవుడికీ, పేదలకీ పెట్టినాడు. ఆయనదగ్గర దమ్మిడీలేదు సర్కార్. ఏమీమోసం చెయ్యలేదు.

తానాషా—మాకు చాలా సంతోషం. ఆయనభక్తుడు. సొంతానికి ఏమీతీసకుండా భక్తి ఆవేశంలో దేవుడికిపెట్టినాడు. మేం సంతోషంగా ఆయనకు క్షమించినాం. ఇప్పుడే వారిని విడుదల చెయ్యవల్సిందని ఆజ్ఞ. ఆయనకు కష్టంయిచ్చినవాళ్లను బంది

ఖానాలో వెయ్యండి. భద్రాచలానికి ఇంకా మా పేరుచెప్పి ఇనాములు వగైరాలు దానంచెయ్యమని రజాక్ సాహేబ్‌తో పోయిచెప్పు.

[తృ. నివే. నిష్క్రమించును.

అక్కన్న మాదన్నలు—[ఒకరినొకరు చూచుకొందురు.

మాదన్న—నిజము నిలుకడమీద తెలియును. జగత్ప్రభూ తమ యనుగ్రహమునకు చాలవందనములు. తమవలన మాకు ప్రపంచములో అపవాదము తప్పిపోయినది.

తానాషా—ఫర్వాలేదు పంతులుగార్లూ, మీరేమీ దిగులుపడవద్దు. మీమీద ఎవరేమి తంటా చెప్పనప్పటికీన్నీ ఇక్కడ వినేవాడు లేడు. మా తెలివి చెడిపోలేదు. మీరు నెమ్మదిగా పోయిరండి. జాగ్రత్తగా మీపని చూడండి. తర్వాత దేవుడిదయ.

అక్కన్న మాదన్నలు—చిత్తము మహాప్రభూ.

[అని మోకరించి సలాములుచేసి నిష్క్రమింతురు.

[తానాషా వారినిచూచుచు నిష్క్రమించును]

---

# దృశ్యము ౧౨

అక్కన్న మాదన్నల యింటిముందు.

[అక్కన్న మాదన్నలు ఎదురెదురుగా ప్రవేశింతురు]

మాదన్నా—అన్నయ్యా, మనప్రాణాలు దినాలమీద ఉన్నవి.

అక్కన్న—ఏం మాదన్నా, అట్లంటావు?

మాదన్న—ఎట్లాగో ఈదినం ఇంటికి ప్రాణంతో వచ్చాం. ఏదినం మనల్ని ఎవరు కడతేరుస్తారో తెలీదు. ఎంతజాగ్రత్తగా ఉన్నా నాకేమో దిగులే.

అక్కన్న—నువ్వే దిగులుపడితే ఇంకేముంది తమ్ముడూ!

మాదన్న—బాబయ్య మనం వచ్చేటప్పుడు మన జాతకాలుచూచి ఏమన్నాడు, జ్ఞాపకముందా? ఆ గండం సమీపిస్తున్నది. మనం గోలకొండకువచ్చి అప్పుడే పదకొండు సంవత్సరాలై పన్నెండవది ప్రారంభమైంది.

అక్కన్న—అవును మాదన్నా మనమేం చెయ్యగలం. బందోబస్తులన్నీ సరిగానే ఉన్నవిగదా. ఎక్కడా అజాగ్రతగా లేముగా.

మాదన్న—కాదు. నాకు తెలిసిపోయింది. మనకాలం ఐపోయింది. చూడు సుల్తాను మాటలలోకూడా ఎంత వేదాంతం కనబడుతుందో! సరే మనసుల్తానే ఇంతవేదాంతిగా ఉంటే మనమూ తగ్గిపోయినాము. అన్నా చూడు, అమ్మను నాయన్ను ఓరుగంటికి తక్షణం పంపించెయ్యి. నాకు దేవుడు సంతానం యివ్వలేదు, నీ పిల్లవాణ్ణి మల్లయ్యను ఆదాదికి ఒప్పజెప్పి బాగా డబ్బిచ్చి సంతోషంగా ఉంచు. అది చాలానమ్మకమైనమనిషి, కృతజ్ఞత చూపుతుంది. కాశీ మొదలు రామేశ్వరందాకా అన్ని పుణ్యక్షేత్రాలలోను బ్రాహ్మలకు శూద్రులకు అందరికి అన్నదానాలకు ఏర్పాట్లుచేయించు. మన తమ్ములుకూడా దూరంగాఉంటే మంచిది.

శ్రీశైలం దేవాలయంలో గర్భగృహంలో బంగారం పూత పూయించు, నేను మొక్కుకొన్నాను. పుష్పగిరి శంకరాచార్య స్వాములవారికి భూములిప్పించు. మనం ఊరిబయట కట్టించిన మహేశ్వరాలయంలో ప్రతిదినం వెయ్యిమందికి భోజనాలు పెట్టించు. మనప్రాణం, ఐశ్వర్యం, అంతా తామరాకుమీది నీటి వంటివన్నయ్యా.

వాతాభ్రవిభ్రమమిదం వసుధాధిపత్యం
ఆపాతమాత్ర మధురో విషయోపభోగః
ప్రాణాః తృణాగ్ర జలబిన్దు సమా నరాణాం,
ధర్మః సఖా పరమహో పరలోకయానే.

అన్నాడు భోజమహారాజు తనశాసనంలో.

అక్కన్న—ఔను వాస్తవం. చిన్నవాడివైనా బుద్ధిమంతుడివి. నువ్వు చెప్పిందంతా చేయిస్తాను. నీమాటవిని సుల్తాను ఓరుగంటికో కొండపల్లికో పోయి ఉంటే ఎంత బాగుండును.

మాదన్న—నేను అప్పుడే అన్నాను, హైదరాబాదు ఎప్పుడైతే మనశత్రువుల చేతబడ్డదో వెంటనే మనం ఓరుగంటికి పోవలసింది—అని. ద్రోహంచేసి పారిపోయిన ఫౌజుదార్లందరూ సుల్తానును భయపెట్టి గోలకొండ కోటలోపలికి తరిమినారు. వాళ్లమాటలకు సుల్తాను మోసపోయినాడు. ఇప్పుడు చింతిస్తాడు. ఓరుగంటికికూడా మొగలాయీలువస్తే, కొండపల్లి ఉన్నది. నెల్లూరు, పుదుచ్చేరివఱకుగాని, బెజవాడ రాజమహేంద్రవరము శ్రీకాకుళంవఱకుగాని ఈ విశాలాంధ్రదేశంలో మనం ఎక్కడ

తిరిగినా మనదే అధికారం. బైట ఉండి దాగుడుయుద్ధం ఎంత కాలమైనా సాగించవచ్చును కదా.

అక్కన్న—సరే. ఐపోయింది. ఇప్పుడు ఈకోటలోపలనే ఉండి మనం యుద్ధం చేయవలసిందేగదా. నేనూ అందరినీ పంపించి వేస్తానుగాని నేనుమాత్రం నిన్ను వదలను మాదన్నా. నాతో చెప్ప కుండా మాత్రం నువ్వు ఎక్కడికీ పోవద్దు. నేనూ నీతోనే ఉంటాను. చస్తే ఇద్దరం ఏకకాలంలో చావవలసిందే.

[ఇరువురు నిష్క్రమింతురు.

---

## దృశ్యము ౧౩

తానాషామంత్రాగారం

[తానాషా, అక్కన్న మాదన్నలు, అబ్దుల్ రజాక్ లారీ, అబ్దుల్లాఖాన్ షానీ ప్రవేశింతురు]

తానాషా—మాబుద్ధిచెడిపోయి మీమాట వినకపోయినా మండీ మాదన్న పంతులుగారూ. మీమాటప్రకారం ఓరుగంటికి పోయిఉంటే ఏకాలానికీ మంచిది. ఆ ద్రోహుల మాటలు విన్నాం, చెడిపోయినాం. ఈ అత్తిమత్తిరావు, ఇంకా కొంతమంది మీకు ద్రోహం ఆలోచిస్తున్నారు.

అక్కన్న—మహాప్రభూ, మాయావచ్ఛక్తి వినియోగించి తగినసన్నాహములు చేసియున్నాము. ఇది మనుష్యప్రయత్నము గదా. ఏది ఎట్లుపోయినను తమసౌఖ్యమే మాకు ప్రధానము. పోయినది పోనిండు. ఇప్పటినుండి జాగరూకులమై యుందముగాక.

మాదన్న—మహాప్రభూ, ఇప్పుడు నామనవి ఏమనగా-

సిఫాయి—[ప్రవేశించి] సర్కార్ సలాం, ఔరంగజేబు పాదుషాగారి దగ్గరనుండి జాబు. [అని ఇచ్చి నిష్క్రమించును.

తానాషా—చదవండి పంతులుగారూ.

మాదన్న—"ఇదివరకున్ను మీరు ఈయవలసి ఏర్పడియుండు కప్పము బాకీ కొఱకు ఒకకోటి ఇరువై లక్ష హొన్నులు సమర్పించుకొన వలసినది. ఇది మొదల్ ప్రతిసంవత్సరము రెండులక్షల హొన్నులు కట్టుచుండవలసినది. తత్క్షణమే ఆ కాఫిర్ గాడ్దెలను అక్కన్న మాదన్నలను తొలగింపవలసినది. లేకపోతే ఈగోల కొండను సర్వనాశంచేస్తాం."

తానాషా—ఆఁ! ఆఁ! ఎంత పాపి ఈ పాదుషా!

మాదన్న—మహాప్రభూ, ఎప్పటికైనా చనిపోవలసినదే గదా. తమవంటి పండితుడు, వేదాంతి. ఇంతటి విశాలాంధ్ర రాజ్యమును పాలించినవాడు ఇప్పటికి చరిత్రలో లేడు. ఇకమీద నెప్పుడుండునో తెలియదు. కొద్దికాలమే ఐనప్పటికిని తమకు మంత్రులుగానుండు భాగ్యము మాకు అబ్బినది. ఈదేహముకొఱకు మాకు చింతలేదు. తమ సింహాసనమును రాజ్యమును దేశమును కాపాడుటకు మాప్రాణములనైన సర్పించెదము. గ్రహింపుడు. లేదా మమ్ముపంపివేసిన మేము రామేశ్వరమునకో కాశికో పోయి కాలక్షేపముచేసెదము. ఈ అపాయము తప్పిపోవునుగాక.

తానాషా—హా! వద్దు, వద్దు, అంతపని వద్దు. మీప్రాణం మాప్రాణం అంతా ఒకటేగాని వేరేకాదు, మేము ఏదైనా వదలు

తాముగాని మిమ్ములమాత్రం వదలము. మీరు మాకు అన్నతమ్ములు మనం ఒకతల్లిబిడ్డలవలె అనుకోండి. మీరులేకపోతే మాకు ఈ సింహాసనమేవద్దు. ఇదంతా దేవుడి వినోదము పంతులుగార్లూ. మాది కూడాసామాన్యప్రాణం. భగవంతుడి వేడుకకోసం మేము ఈ సింహాసనంమీద ఉన్నాం. ఈ ప్రపంచమంతా ఆశ్చర్యం, తమాషా, సందేహం, మోసం ఉంది. మనం ఎంతకాలం ఉండపోతాం? ఈ పాదుషా జాబు చింపివేయండి. పాదుషా ఎవడు మాకు బుద్ధిచెప్పడానికి? మేము మామంత్రులను వదలం. ఎంతమాత్రం వదలం.

మాదన్న — మహాప్రభూ, మరి మామనవి ఏమనగా—

తానాషా — మీఆలోచన నాకుతెల్సును పంతులుగారూ, చాలాబాగాఉంది. మనం జాగ్రతగా ఉంటాం. మనకోటలో పదిసంవత్సరాలకు కావలసినసామగ్రి ఉంది. మొగలాయీలు ఏమి ఎత్తువేస్తారో చూచుకొని మనం మనప్రయత్నాలు చేస్తాం. మీరు చెప్పింది సరి. సమయోచితంగా చేస్తాం, గాభరా లేకుండా మాఖిల్లాను రాజ్యాన్ని అంతా కాపాడేభారం మీది. భగవంతుడి దయవల్ల నాకు మీరు అన్నదమ్ములు రామలక్ష్మణులు మంత్రులైనారు. అంతా దైవసహాయం.

మాదన్న - అంతయు దైవమే మహాప్రభూ. మరి పెక్కుమాటలేల? మాకు పూజకు సమయమైనది. మధ్యాహ్నము పదునొకండుగంటలైనవి. ఏలినవారు శెలవిప్పింపుడు.

తానాషా — అచ్ఛా పోయిరండి.

[అక్కన్న మాదన్నలు సలాములుచేసి నిష్క్రమింతురు.

తానాషా—ఎంతమంచివారు, ఎంత బుద్ధిమంతులు! వీళ్లు లేకపోతే మాగతి ఏమైపోయిఉండును రజాక్ సాహెబ్.

రజాక్—చాలాఉత్తములు జహాపనా యీపండత్తులు. వీళ్లఉపాయంవల్లా ఔరంగజేబు ముట్టడిమాని వాపసుపోకుండా తప్పదు. తర్వాత మనం కొత్త జాగ్రత్తలు చేస్కోవాలా.

తానాషా—అంతా వీళ్లేచేస్తారు. మాప్రాణాం, మా ఆశలు. మావృద్ధి, మారాజ్యం, అంతా వీళ్ల చేతుల్లో ఉంది. మాకు తాకకం వీళ్లేగదా. [లోపల అలుపులు శబ్దములు]

తృ. నివేద—[తటాలున పరుగున వచ్చి] సర్కార్ మర్గయా, మర్గయా సర్కార్, అక్కన్నా మర్గయా, మాదన్నా మర్గయా, జనానా సిబ్బంది పొంచి ఉండి వాళ్లమీదికి ఉఱికి వార్ సర్కార్. జంషీద్ నగ్గె రాలుపోయి వాళ్లను పల్లకీసుండి లాగి కత్తితో నఱికి వాళ్లకు నడివీధిలో లాగుతూ ఉన్నారు సర్కార్ ఖిల్లా దర్వాజా బయట. అంతా అపాయం గలటా గంధర్గోళం ఉంది సర్కార్.

[లోపల అలుపులు శబ్దములు.

తానాషా—ఆఁ ఆఁ ఆఁ! [అని నివ్వెఱపోవును] హా!హా!హా! ఎంతద్రోహం! ఎంతద్రోహం! అయ్యో మాదన్నా! అయ్యో అక్కన్నా. మాచేతులు రెండు విఱిగిపోయినవండి రజాక్ సాహెబ్. మానెత్తిమీద పిడుగు పడింది.

మఱియొక నివేద—సర్కార్ అత్తిమత్తరావు సిబ్బంది కూడా వాళ్లమీదికి ఉరికింది, అక్కన్న మాదన్నల తలకాయలు

నరికినారు. వాళ్ల మేనల్లుడు రూస్తుంరావుగారిని వారియింటి దాకా గుంపుతరిమి ఇంట్లోనే కత్తితో పొడిచినారు. ఆయన అప్పుడే చచ్చిపోయినారు హుజూర్.

తానాషా—అయ్యో! పోయి ఈ గలాటా ఆపండి, ఆపండి జంషీదును ఖైద్ చెయ్యండి. అత్తిమత్తరావును నరికి వేయండి. పొండి. [జవానులు నిష్క్రమింతురు.

తానాషా—హా! అక్కన్నా! మాదన్నా!

[సోఫాలో పడిపోవును.

రజాక్—ధైర్యం తెచ్చుకోండి సర్కార్. మాకు హుకుం ఇవ్వండి. ఎవరురా అడ్డా ఆ దుర్మార్గులను పట్టి ఆపండి.

మరల నౌకరు ప్రవేశించి—సర్కార్ గుంపుపోయి మాదన్నగారిఇంటిచుట్టూ వెయ్యిమంది హిందువులను చంపినారు. మంత్రులభార్యలు భావిలో దుమికినారు. అక్కన్నా కుమారుడు మల్లన్నా అనే పిల్లకాయను తీస్కోని వాళ్లదాది ఎక్కడికో పరారి అయింది.

మరియొకనౌకరు ప్రవేశించి—సర్కార్ గలాటా తగ్గిపోయింది. శానామందిని ఖైద్ చేసినార్ మన సర్దార్లు. జంషీద్ అత్తిమత్తరావు వగైరా ద్రోహులు పారిపోయి మొగలాయీ ఫౌజులో చేరినారు సర్కార్. అక్డ ఈ పాపాత్ములకు మర్యాద జర్గుతా ఉంది సర్కార్.

తానాషా—[తటాలున లేచి నిలువబడి] అరే మీరు పోయి ఖిల్లాదర్వాజా తెరిచి వెయ్యండి. ఔరంగజీబుగాని మొగ

లాయీవా శివాజీనాగాని వచ్చి గోల్కొండను స్వాధీనం చేస్కోని పోమ్మని చెప్పండి. ఇంకమాకు గోల్కొండా వద్దు ఏమీవద్దు. ఈరాజ్యం గీజ్యం మీరే తీసండి. ఎంత పాపాత్ములు వీరంతా. ఈ జనానావాళ్లు ఎంత పాపులు. వీరంతా నాశమయ్యే కాలం వచ్చింది. మొగలాయీలు మిమ్ము తునకలు తునకలుగా నఱుకుతారు. ఈ ఊరు వచ్చిడి చేస్తారు. హా! అక్కన్న మా అన్న, మాదన్న మాతమ్ముడు. వాళ్లు పోయింతర్వాత మాకు ఎందుకండీ ఈరాజ్యం ఈపాడు ఐశ్వర్యం? హా! అల్లా! అల్లా! [అని జడుడై యుండును]

రజాక్—ధైర్యం తెచ్చుకోండి సర్కార్, ధైర్యం తెచ్చుకోండి. హుజూర్ ఇట్లా ఉంటే మే మంతా ఎట్లా ఉండేది. మాకు ధైర్యంచెప్పవలసినవారు మీరు. ఇదంతా దేవుడిచేష్ట జహాపనా. మీకు తెల్వందీ ఏమి ఉంటుంది సర్కార్.

తానాషా—అక్కన్న మాదన్నలు మాకుప్రాణం, వాళ్లే మాకు జీవం. ఆహా! ఈదేశానికి ఎంతపనిచేసినారు! ఎంత మేధావులు. రాజ్యం విస్తరించినారు, ధనం చేర్చినారు, ఊరు కాపాడుతున్నారు. మహమ్మదీయులతో ఎంత స్నేహం చేసినారు. మేమంటే వాళ్లకు ఎంత ప్రియం. రాజ్యం వస్తుంది పోతుంది. అట్లాంటి స్నేహితులు వస్తారా? అట్లాంటి పెద్దమనుష్యులు వస్తారా? అట్లాంటి మేధావులు వస్తారా? రజాక్‌సాహెబ్ మేమంటే వాళ్లకు ఎంత ప్రియం! ఎంత గౌరవం! ఎంత స్నేహం! ఎంత సమదృష్టివాళ్లది! హిందూముసల్మాను భేదం ఎక్కడా పెట్టుకోలేదు.

అయ్యో! వద్దండీ మాకు ఈతక్తు, ఈ ఐశ్వర్యం, ఈ దౌలతు, ఈ రాజ్యం. మేం ఫకీరు ఐపోతాం, సన్న్యాసి ఔతాం. మక్కా పోతాం, కాశీ రామేశ్వరాలు తిర్గుతాం. తెరిచివెయ్యండి, దర్వాజా తెరచివెయ్యండి. ఖిల్లా దర్వాజా తెరిచివెయ్యండి. శత్రువు లోపల్కి రానీ, సర్వసంహారం చేయనీ. అక్కన్న మాదన్న లకీ చంపినవారిని తునకలు తునకలుగా నఱికివేయనీ.

[అని మరల సోఫాలో పడిపోవును.

రజాక్—జహాపనా.

తానాషా—తలుపులు తెరిచివేయండి.

రజాక్—జహాపనా.

తానాషా—మేం కూడా చచ్చిపోతాం. మా వజీర్లను ఎందుకు ఈపాపాత్ములు చంపినారు. వాళ్లేమి ద్రోహం చేసినారు ? వీళ్లకు మేం శత్రువులైతే మాకెందుకు చంపగూడదు. పాడు ఐశ్వర్యానికోసం దేవుడిచ్చిన ప్రాణం తీసేవాళ్లు ఎంత నీచులు. దుడ్డుదుగ్గాణి మనిషి ఇస్తాడు, ప్రాణం ఇస్తాడా ?

రజాక్—జహాపనా.

తానాషా—అవును, మేం చెప్పింది సరి. మాకు పొడిచి వెయ్యండి సాబ్. మీ సొంతచేతితో పొడిచివెయ్యండి. మీ వంటి మహాత్ములచేతిలో చచ్చిపోతే పుణ్యం వుంటుంది.

రజాక్—అయ్యో! అయ్యో! అంతపాపం నాకు వద్దు.

తానాషా—మరి ఎట్లాగండీ రజాక్ భాయి ఈ ఆరాటం తీరడం ?

రజాక్—సర్కార్.

కాసాషా-[నెమ్మదిగా] రజాక్ సాహేబ్, చెప్పండి భాయి, చెప్పండి.

రజాక్—హుజూర్, దయచేసి తొందరపడవద్దు. మనకు ఇంకా చాలా పనిఉంది. మీరు మహా వేదాంతులు కదా. ఎవరికీ కాలం రాకుండా వారు పోరు. ఎవరి నసీబ్ వారికి తప్పుతుందా? నెత్తిరాత సర్కార్. మంచి గొప్పమంత్రులు, ఇంత చిన్నవయస్సులో ఘోరంగా చచ్చినారు. మనం ఇంతమంది ఉండి, వాళ్లు తామే ఎంత జాగ్రతగా ఉండి కాపాడ లేకపోయినాం. ఏనా ఫర్వాలేదు. మేం ఉన్నాం. ద్రోహులు ఒక రిద్దరు ఎక్కడా వుంటారు. వెల్తురుతో కూడ నీడ ఉంటుంది. రాత్రి లేకపోతే పగలు లేదు. ఎవరిపాపం వాళ్లను కొట్టుంది. నల్గురు పాపాత్ములకోసం ఊరంతా పాడువెయ్యడంలో ఉండే న్యాయం తామే ఆలోచిస్తే బాగా ఉంటుంది సర్కార్. నేను మీ నౌకరిచేసినాన్ గదా ఇన్ని దినాలూ, మీకోసం కత్తి పట్టినాన్ గదా, మీ పేరుచెప్పి పోడుస్తాన్ గదా. నావంటివాళ్లు చచ్చిపోయ్యేవఱకు దర్వాజా తెఱవవద్దు సర్కార్. మాప్రాణాలు తీస్కాని మాశవాలమీద నడిచి, మా గొంతులు తొక్కి, శత్రువు లోపలిక్కివస్తే మా ముసలి ప్రాణం హాయిగాపోతుంది హుజూర్. నమ్మక్ తిన్న ఋణం తీర్తుంది సర్కార్. ఇప్పుడు దర్వాజా తీయిస్తే మేం ఎవరికోసం లడాయిచేస్తాం, ఎవరిపేరు చెప్పి పోడుస్తాం, ఎవరికి నౌకరీ చేస్తాం. మీరుపోతే మేముకూడా మీతోనే పోతాం సర్కార్. తర్వాత

ఒక్క క్షణం ప్రాణంతో ఉండము. ఉండము సర్కార్. ఉండనే ఉండము సర్కార్. అబుల్ హసన్ తానాషా సుల్తాన్వారికి నౌకరి చేసినవాడు ఇంకొకడికి నౌకరిచెయ్యడు జహాపనా, వాడు మంచి ముసల్మాన్ ఐతే. నాప్రార్థన వినండి. హుజూర్ శెలవ్వాయిస్తే నేను కాపాడుతాన్ ఈ ఖిల్లా అంతా. నాప్రాణం మీాద ఔరంగ జీబు లోపల్కి రాసీండి. ఈ ఒక్క చిన్న అనుగ్రహం చెయ్యండి. నామీాద దయా చెయ్యండి. ఈ ముసలివాడు ఇంకా ఎంతకాలం బతుకుతాడు హుజూర్. శెలవు దయచెయ్యండి. మీా పాదాల మీాద కోర్తాన్. [అని మోకరించి సలాముచేయును.

తానాషా—హా! హా! హా! రజాక్ భాయి, లేవండి భాయి లేవండి. [అని కౌగిలించుకొని] మీాయిష్టప్రకారం కానీండి. ఈ ఖిల్లా అంతా మీాస్వాధీనం. ఎట్లాగూ చచ్చిపోతాం. ఆ పాదుష్యాది మీాయిష్టప్రకారమే పోతాం. ఈ కొంచంలో మీా మనసుకు ఎందుకు నొప్పి.

రజాక్—చాల సంతోషం. సర్కార్ నేనుపోయి పని చూస్తాను. తాము కొంచెం విశ్రాంతి తీస్కోండి.

సిఫాయి—[ప్రవేశించి] సర్కార్. హైదరాబాద్ నుంచి ఫౌజ్ బైలుదేరి వస్తావుంది గోల్కొండా ముట్టడివెయ్యడాన్కి. ఇంకా అలంఘీర్ వారి ఫౌజంతా బయలుదేరి మాళ్ఖేడ్ చిత్తా పూర్ మార్గంగా గోల్కొండకు వస్తావుంది. పాదుషావారికి ఇబ్రం హీంఘుర్ కోట స్వాధీనం ఐవి. అక్కడి సర్దార్ ఘ్యాజుద్దీన్ బహద్దర్ ఫిరోజ్ జంగ్ గారు పాదుషావారితో చేరినారు. అంతా కలిసి వచ్చి మోర్చా చెయ్యపోతారు సర్కార్.

తానాషా—రజాక్‌సాహెబ్. మనం ఏమి ప్రతిక్రియ చేస్తాం.

రజాక్—అరే సిఫాయి నీవు పోవచ్చును.

[సిఫాయి నిష్క్రి.

సర్కార్ ఖిల్లా భద్రంగా ఉంది. చూస్తాం ఇంకా. మన వాళ్లే మనకు ద్రోహం చెయ్యకుండా చూడవాలా.

తానాషా—ఇదంతా ఆశ్చర్యం! దైవగతి. అల్లా చేసే దాన్కి ఏమిచేస్తాం. మమ్మల్ని పాదుషా విడిచిపెట్టడు. అతనిది మొండిపట్టు. ఇంక మనం జనులప్రాణాలు రక్షించేమార్గం చూడ వలసిందే. రజాక్‌సాహెబ్ ఇంక అంతా మీచిత్తం.

రజాక్—సర్కార్, తాము విశ్రాంతి తీస్కోండి.

[అని తానాషాను లోపల వదలివచ్చి తాను మఱియొకవైపు విచ్చుకత్తితో నిష్క్రమించును.

---

## దృశ్యము ౧౪

సాదత్‌ఖాన్ విడిది.

[సాదత్‌ఖాన్ ఇటునటు పచారుచేయుచు ప్రవేశించును.]

సాదత్—ఇంక గోల్కొండ మాకీ ఏక్‌లాడూ. అక్కన్న మాదన్నలు పోయింతర్వాత అబ్దుల్‌రజాక్‌లారీ ఒక్కడు నమ్మకమైన సర్దార్. అతఁడేమిచేస్తాడు? ఏకాకి. పాదుపావారు బయల్దేరినారు. కానీ. వారు రానీ బిజాపూరుగతి గోల్కొండకు కూడా పడుతుంది.

సిఫాయి—[ప్రవేశించి] సర్దార్సాహేబ్, పాదుషాగారి దగ్గరనుంచి కబుర్ వచ్చింది. ఇద్గో జాబు.

[అని ఇచ్చి నిష్క్రమించును.

సాదత్—[పుచ్చుకొని చదువుకొనును] "మేం బిజాపూర్ జయించినాం. మన ఫౌజ్ అంతా తర్లి హైదరాబాద్ కు వస్తున్నారు. త్వరలో మా విజయ పతాకలు అక్కడ ఎగరగలవు. ఈలోపల నీవు తానాషానుగుంజి సాధ్యమైనంత ధనం లాగి నీ ఉద్యోగధర్మం నిర్వహించవలసిందని మా ఆజ్ఞ. అక్కన్న మాదన్నలను నీవు చంపించింది అంత పెద్దసంగతి కాదు. వాళ్లు నా రాజమార్గంలో గడ్డి పుల్లలు. నీవు చేయవలసిన పని ఇక మీాద ఉంది." ఆహా. ఎంతచేసినా ఈపాదుషాకు తృప్తిలేదు. ఇంకా ఏమిచేయవచ్చును. తానాషా పట్టకే రెండు రెక్కలు చింపి పారవేసినాన్ గదా. పాదుషా చాలదంటాడు. అరే అల్లా ప్రభువులకు తృప్తిలేదే.

సిఫాయి-[ప్రవేశించి] సర్దార్ సాహేబ్. ఇద్గో తానాషా సుల్తాన్ దగ్గరనుండి మనజాబుకు జవాబ్.

సాదత్—లావ్. [అని గ్రహించి చదువును] "రాయ్యాబర భాయ్, సలాం. ఈ దుర్భిక్షంలో ధనం సంపాదించడం చాలా కష్టంగావుంది. జనం అన్నంలేక అల్లాడిపోతున్నారు. ఎక్కడా దమ్మిడీ లేదు. అందుచేత నేను నావాగ్దానం నెరవేర్చుకోవడానికి డబ్బుగా కాకుండా వస్తువులుగా సమర్పించుకోదలచినాను. రత్నాలు, ఆభరణాలు, బంగారం, వెండి మొదలైనవి పంపుతాను.

ఇవి మీకు సమ్మతమైతే మీ ఖ్వాజాసరాను మాదగ్గరికి పంపండి. ఆవస్తువులను మేము ముట్టచెప్పడానికి సిద్ధంగా ఉన్నాం" పనికి రాదు. ఈజాబుకు మేం జవాబ్ ఇవ్వం. కానీ తానాషా ఏంచేస్తాడో చూస్తాం.

తానాషా నౌకర్ -[ప్రవేశించి] సలాం సర్దార్సాహేబ్. మా సుల్తాన్ వారికి ఏమి జవాబ్.

సాదత్—జవాబ్ నై.

తా. నౌ.—సలాం.

సాదత్—నేను జవాబ్ ఇవ్వకపోతే తానాషా గాభరాపడి ఇంకా ఎక్కువగా ఇస్తాడు: ఎక్కడినించైనా తెస్తాడు. నేను నడ్మ నాటకమాడ్తాను. పాదుషా నాకు దమ్మిడీ మెహనత్ చెయ్యడు. గడ్డిపుల్లంత తప్పు దొరికితే చంపి పారవేస్తాడు. నేను నాసంచి ఇప్పడే నింపుకోవాలా. అచ్ఛా. ఇట్లా వ్రాస్తాను. [అని వ్రాయుట నభినయించును.]అబుల్ హాసన్ తానాషా సుల్తాను బహద్దర్ వారికి సలాములు. పాదుషాగారు మీమీద చాల దయగా ఉండేలాగా ఇప్పుడే ఖబుర్ వచ్చింది. మీరు ఎంత ఎక్కువ సొమ్ము పంపితే వారు అంత సంతోషిస్తారు. గోల్కొండా మీదికి రాకుండా వాపస్ పోతారు." [అని వ్రాసి నౌకరు చేతి కిచ్చి] దీన్ని రవాణాకరో తానాషా సుల్తానుగారిక్కి.

[నౌకరు నిష్క్రమించును.

తానా. నౌకర్—[మరల ప్రవేశించి] సలాం సర్దార్సాహేబ్. మీకు కోపం వచ్చిందని తలచి మా సుల్తాన్ వారు

మీాకు పంపడాన్కి తయార్ ఉంచిన నగలన్నీ ఈపెట్టెలో పెట్టి, లకోటాకట్టి, తామే మొహర్ వేసి పంపినారు. ఇద్గో నగల జాపితా. దీన్కి మీారు పైకానికి బదులు తాకట్టుగా పెట్టు కొంటె రెండుమూాడు దినాలలో ఎంతపైకం వసూాలైతే అంత పంపుతామని మాసుల్తాన్వారు చెప్పిపంపినారు. మీారు దీన్కి పాదుషావారికి పంపె సిఫారస్ చేయవలసిందని సుల్తాన్వారు నా నోటితో మన్వి చేస్తున్నారు.

సాదత్—అచ్ఛా. ఇద్గో ఇప్డే రవానా చేస్తాం. [అని తీసికొని పంపువానివలె నభినయించి] ఎవరురా అక్డ... ఉండు చెస్తాన్.

సాదత్. నౌకర్.—[ప్రవేశించి] సర్దార్సాహెబ్ తమ జాబు సుల్తాన్వారి కిచ్చినాన్. వారు ముందే తమకాడ్కి జవాన్కు పంపినార్. ఐతే పోనీలే, ఫర్వాలేదు, మీాజాబు చూాచినాం. సంతోషం. అని మర్యాదచేసి తమకీ ఈపండ్లు ఇనాం పంపినార్.

సాదత్—అచ్ఛా, వారు చాలా గొప్పవారు, వారికి మాసలాములు చెప్పు.

తా. నౌ—సలాం. అని నిష్క్రమించును.

సాదత్—ఈ నగల్ అంతా నేను తినివేస్తాను. పాదు షాకు పంపేఅంత తెలివితక్కువ వేరేలేదు.

[అని పెట్టెతో జవానుతో నిష్క్రమి.

# దృశ్యము ౧౪

[బిజాపూరులో ఔరంగజేబు స్కంధావారము.]

[ఔరంగజేబు, సాదత్ ఖాన్, ఇద్దరు సిఫాయీలు మొదలైనవారు మీర్ ఇబ్రహీం, మీర్ హాషీమ్‌లు ప్రవేశింతురు.]

ఔరంగ—సాదత్ ఖాన్ గోల్కొండా సుల్తాన్ ఏమి అంటాడు ?

సాదత్—ఆయన గోల్కొండా ఖిల్లాలో హాయిగా ఉన్నాడు హుజూర్. పది సంవత్సరాలకు కావలసిన సామాగ్రి ఉంది లోపల. పెద్ద ఫౌజ్ తో లోపలకూర్చుంటి భోజనంచేస్తూ ఎంతకాలం ఐనా లడాయిచేస్తాడు జహాపనా.

ఔరంగ—మనబాకీలు ఏమీ పంపలేదా ?

సాదత్—ఎందుకు పంపుతాడు జహాపనా ?

ఔరంగ—మన ఫర్మానాకు ఏమిజవాబ్ ?

సాదత్—జవాబ్ లేదు హుజూర్.

ఔరంగ—ఆకాఫిర్ పిల్ల కాయలు పోయింతర్వాతకూడ వాడికి బుద్ధిరాలేదా?

సాదత్—బుద్ధి ఎందుకువస్తుంది హుజూర్? వచ్చేబుద్ధి మొదటనే వస్తుంది. ఇంతకాలం ఆలస్యంచేస్తుందా.

ఔరంగ-చెడిపోతాడు. చెడిపోతాడు. వీడు ముసల్మాన్ గదా అని మేము దయచూపిస్తే కూడా వీడికి తెల్వి రాలేదు.

ఇప్పటిక్కి మేం ఎంతో ఓర్పుతో క్షమించినాం, ఇంక ఆలస్యం చేస్తే అల్లా ఓర్చడు. సరి సాదత్ ఖాన్, ఇప్పుడు గోల్కొండా మే సందర్భం యేమి?

సాదత్ - హైదరాబాద్ అంతా మనస్వాధీనం. మూసీనదికి ఇవతల గోల్కొండావాళ్లు అడుగు పెట్టడాన్కి లేదు. నవెదగ్రా నుంచి ఖిల్లాచుట్టూ అంతా వాళ్లస్వాధీనంలో వుంది. మనం రా వచ్చును పోవచ్చును. అంతా చాలాబందోబస్తుమే వుంది. అబ్దుల్ రజాక్ లారీ అబ్దుల్లా ఖాన్ పానీ ఇద్దరుసర్దార్లు ఉన్నారు. లారీ చాలా గొప్పవాడు.

ఔరంగ—ఉం. చూస్తాం. వీళ్లకు లంచంయిస్తే.

సాదత్.—హుజూర్, అబ్దుల్లాఖాన్ పానీ తీసినా తీయ వచ్చునుకాని అబ్దుల్ రజాక్ లారి దేవుడితో సమానం జహాపనా. దమ్మిడి తియ్యడు. బలేగట్టివాడు.

ఔరంగ - అచ్ఛా. చూస్తాం. ఈజాబువ్రాయి తానాషాకు.

[సాదత్ ఖాను వ్రాయుట నభినయించును.]

"అబుల్ హసన్, నీవు ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొన్నావు అని మేం అనుకోవడానికి లేకుండావుంది నీదుర్మార్గం. దురదృష్ట వంతులలో నీపేరు మొదట వ్రాయవలసి ఉన్నందుకు మాకు చాలా విచారంగా ఉంది. నీది వట్టి హ్రస్వదృష్టి. నీకు వివేకం కొంచెంకూడా లేదు. వచ్చేమార్గంకూడా కనపడలేదు. నీవు చేసిన దుర్మార్గాలకు లెక్కలేదు.

ఒకటి—నీవు నీరాజ్యాధికారం అంతా ఆకుటిలాత్ములు, మతహీనులు, దుర్మార్గులు అక్కన్న మాదన్నలస్వాధీనంలో పెట్టి

నావు. గొప్ప గొప్ప సయ్యదులు, సన్యాసులు, మహమ్మదీయ మహాత్ములనంతా ఆ కాఫిర్ల కింద పెట్టినావు.

రెండు—ప్రత్యక్షంగా చాలాదుర్మార్గాలు చేసినావు. ఎప్పుడుచూచినా నిషాలో ఉంటావు. ఆడవాళ్లను వదలలేవు.

మూడు ఇస్లాంతో సమానంగా కాఫిర్ మతాన్ని గొప్పగా చూస్తావు. హిందూగాడ్డెలు నీకు ముసల్మానులకంటె ఎక్కువ.

నాలుగు—న్యాయం, అన్యాయం, పూజ తిరస్కారం, మంచి చెడ్డ—ఇదంతా నీకంటికి ఒకటే.

ఐదు—ఆ తుచ్ఛుడు, శివుడికొడుకు, శంభుడనే వాడికి సహాయంచేస్తున్నావు. ఇందువల్ల నీకు ఇహంలేదు, పరంలేదు. మతద్రోహులకు సహాయం చెయ్యకూడదని ఖొరాన్‌లోలేదా ?

ఆరు—లెక్కలేని ఫర్మానాలలో మేం దయతోచెప్పిన పనులలో ఒకటికూడా చెయ్యలేదు నీవు. మేం పంపిన పెద్దమనుష్యులమాటలు ఒకటికూడా నీకు లక్ష్యంలేదు.

ఏడు—ఈనడ్మనే ఆ శంభూదుర్మార్గుడికి ఒకలక్ష హొన్నులు సహాయం చేసినావు.

ఎనిమిది—ఇప్పుడు గర్వంచేత కన్నులు కనబడకుండా ఇంకా నీ చెడ్డమార్గంలో ఉన్నావు. నీకు ఏదో ఇహంలోను పరంలోను మోక్షం ఉంది అని అనుకొని భ్రమపడుతున్నావు. చెడిపోతావు. నీ ఆశ అంతావ్యర్థం, నీతలంపులంతా తెలివితక్కువ. ఇప్పటికైనా నీవు బుద్ధితెచ్చుకొని మాపాదాల్మీదపడితే నిన్ను అల్లా క్షమించే దానికి అవకాశం ఉంటుంది.”

ఈ జాబును నీవు రవానాచెయ్యి సాదత్ ఖాన్.
సాదత్—చిత్తం హుజూర్, అలాగే చేస్తాన్.

[అని నిష్క్రమించును.

ఔరంగ.—మీర్ హాషీమ్‌సాహెబ్, మీరు గోలకొండ వారు కదా. మీకు అక్కడి రహస్యం అంతా తెలిసి ఉంటుంది. మీరు పెద్దఫౌజ్ తీస్కొని రాయ్బారం బయలుదేరి పొండి. 'అక్కన్న మాదన్నలు పోయినారు గదా. ఇంక తానాషాతో మాకు జగడంలేదు.' అని బయలుదేరి పోయి హైదరాబాద్‌లో ఉండే మన ఫౌజ్‌తో చేరి హఠాత్తుగా ఒకదినం మీదపడి గోల్కొండా స్వాధీనం తీస్కోండి. మేం మీవెన్కాలనే వస్తాం. మీకు సహాయం మీకొమారుడు అబ్దుల్ కరీమును పిల్చుకొని పొండి.

మీర్ హాషీం—సర్కార్ ఆజ్ఞ. [నిష్క్రమించును.

దౌవారికుడు—[ప్రవేశించి] సలాం సర్కార్. బిజాపూరు నుంచి మన ముస్లిం ముల్లాలు ఖాజీలు ఫకీర్లు చాలామంది అడ్గుతారు. "జహాపనా, మీరు ముసల్మానులు, మతం మీద అభిమానం ఉండేవారు. న్యాయశాస్త్రం తెలిసినవారు. ఖొరానులో లేనిదాన్ని చేయరు. ఇంత గొప్పవారు మీసహోదర మహమ్మదీయులతో లడాయి చెయ్యడం న్యాయమా. బిజాపూరు కొట్టినారు. ఇప్పుడు గోల్కొండా మీదికి పోతున్నారు. వీళ్లంతా ముస్లింలే కదా. మీరే చెప్పండి." అని

ఔరం.— వాళ్లకి పోయి చెప్పు. "మీరు చెప్పింది అంతా నిజం. నాకు మీరాజ్యాలు గీజ్యాలు అక్కరలేదు. ఆద్రోహి శంభూ మీదగ్గరా ఉన్నాడు. వాడిని మీరు డబ్బుయిచ్చి సహాయంచేసి కాపాడుతున్నారు. వాడు ఇక్కడినుంచి ఢిల్లీదాక ముసల్మానుల నందరినీ హింసచేస్తాడు. వాడిని పట్టి మాకు స్వాధీనం చెయ్యండి. మేం పోతాం."

దౌవారికుడు.—సలాం. [అని నిష్క్రమించును.

ఔరంగ.—మీర్ ఇబ్రహీంసాహెబ్ మీరు, మా కొమారుడు షాఆలం, మన రుహల్లాఖాన్, ఘ్యాజుద్దీన్ ఖాన్ పిరోజ్ జంగ్, కులిజ్ ఖాన్ గారు, రాజపుత్రులు కిషోర్ సింగ్ హాదా అంపెరు గోల్కొండముట్టడికి బయలుదేరండి. ఒక నెలలోపల గోల్కొండా మాస్వాధీనం కావాలా. ఇదే మా హుకుం.

మీర్ ఇబ్రహీం.—సర్కార్ ఇహుకుం.

[అని సలాముచేసి నిష్క్రమించును.

దౌవారికుడు.—[ప్రవేశించి] సర్కార్ సలాం. గోల్కొండలో ఇప్పుడు అబ్దుల్ రజాక్ లారీసాహెబ్ గారు బడావజీర్. ఆయనే అక్కడ అంతా. ఆయ్నగారికి ఎట్లా తెల్సిపోయిందోగాని మన మీర్ హాషీంగారు పోయ్యేదారిమే పొంచి ఉండినారు. ఆయన వచ్చింది, ఉండేది హైదరాబాద్ లో ఉండే మన సిబ్బందికి కూడా తెల్వదు. రజాక్ సాహెబ్ గారు, షారెజ్ ఖాన్, ఇంకా బడా బడావాళ్లు మునగాల దగ్గర, హైదరాబాదుకు ఇరవై మైళ్ల దూరంలో ఉండినారు. మన మీర్ హాషీంగారున్ను అబ్దుల్ కరీం

గారున్ను మునగాల రాగానే వారిమీదికి గోల్కొండఫౌజ్ దుమికి నజేకి చంపి పూర్తిగా దోచుకొన్నారు. మీర్ హాషీం గారు చచ్చిపోయినారు. అబ్దుల్ కరీంగారిని ఖైద్ చేసి గోల్కొండ వారు తీస్కొనిపోయినారు. ఈ దెబ్బతో పోయి గోల్కొండవాళ్లు హైదరాబాద్ మీదపడి అక్కడ ఉండే మన ఫౌజుసంతా విసిరి కొట్టినారు. మనసిబ్బందికి అన్నం లేదు. గుఱ్ఱాలకు గడ్డి లేదు. ఎడ్లకు నీళ్లు లేవు. మనవాళ్లు ఇప్పుడు కోహీర్ లో ఉన్నారు హుజూర్.

ఔరంగ—ఫర్వాలేదు. మేం బయలుదేరి వస్తావున్నాం. అందఱు దివాణం దివాణంగానే గోల్కొండమీదికి తర్లవల్సింది. ఇది మాహుకుం. దండోరావెయ్యి.

[లోపల దండోరా, ఔరంగ—నిష్క్రమించును,]

---

## దృశ్యము ౧౬

తానాషా మందిరము.

[తానాషా అబ్దుల్ రజాక్ లారీయు ప్రవేశింతురు]

తానాషా—ఫర్వాలేదు రజాక్ భాయి, సాదత్ ఖాఁ మంచివాడు. పాదుషాకు సిఫారస్ చేసి ఈసమయంలో కాపాడుతాడు. మీ అభిప్రాయం ఏమి ?

రజాక్—సర్కార్, నమ్మడాన్కి లేదు. పని జరిగేవరకు నిశ్చయంలేదు. వీళ్లంతా ద్రోహులు హుజూర్.

సిఫాయి—[ప్రవేశించి] సర్కార్ సలాం. ఢిల్లీపాదుషా

బిజాపూర్ జయించి, ఆఖరిలో బడాఫౌజ్ తీస్కొని గోల్కొండామీదికి తర్లి వస్తావున్నార్.

తానాషా—ఆహా! మీరుచెప్పింది నిజం, రజాక్ భాయి, అంతానిజం. ఇదంతా మొగలాయీలవారి కపటప్రయోగం. అరే సిపాయి, నీవుపోయి సాదత్ ఖాన్ దగ్గరనుండి మేంపంపిన నగలుపెట్టె వాపస్ చెయ్యమని చెప్పు.

సిపాయి—చిత్తం, సలాం. [నిష్క్రమించును.

తానాషా—ఎంతద్రోహి! ఎంతద్రోహి! నోటిలో తేనె కడుపులో విషం! నోటిలో అన్నం గొంతుమీద కత్తి!

రజాక్—సర్కార్, ఇంతవేదాంతులు, ఇంతమంచివారు, మీకే లోకం ద్రోహంచేస్తే తర్వాత ఏమి ఉన్నది హుజూర్. మన మంత్రులను చంపించిన పాపాత్ముడికీ మనమీద కనికరం ఎందుకు ఉంటుంది.

తానాషా—అతనికి పశ్చాత్తాపంరాదా?

రజాక్—ఆహా! మీరు లోకమంతా మీవలె అనుకుంటూ ఉన్నారు.

సిపాయి -- [మరల ప్రవేశించి] సర్కార్ సలాం. సాదత్ ఖాన్ గారు ఇలాగా చెప్పినార్. "నాకు కూడా అటువంటి సమాచారమే వచ్చింది. త్వరలోనే పాదుషాగారి బాపుటా ఇక్కడికి వస్తుంది. సందేహం లేదు. పాదుషాగారికోసం మీరు పంపించిన నగలు వగైరా నేనుఆపండ్లతోనే వారికే పంపినానుగదా. నేను నా ధర్మం నెరవేర్చుకున్నాను. ఇప్పుడు ఆసామాను ఏదిన్నీ

నాదగ్గ్రా లేదు. .వానికి బదులు, నాతల, నాప్రాణం పాదుషావారి పేరుచెప్పి బలివెయ్యవలసిందే.” అని.

తానాషా—ఎంతఫాగర్! ఎంతధిమాక్! తత్క్షణం పోయి సాదత్ ఖాన్ ఇంటికి ముట్టడి వెయ్యండి. అతని యిల్లు సోదా వేయిస్తాం. [సిఫాయి నిష్క్రమించును]

మఱియొకసిఫాయి—సర్కార్ పాదుషావారు ఫౌజ్ తో బయలుదేరి చిత్తాపూర్ మార్గంగావస్తావున్నార్. మోర్చాలు, ఫిరంగులు, మందు సామాన్ బండ్లు, గుఱ్ఱాలు, ఏనుగులు, సముద్రంలాగా వస్తావుంది. అక్కడ జనాలు గాభరాపడి ఇల్లు గిల్లు పొలంగిలం పశువులు డబ్బు అంతావదలి పారిపోయివస్తా వున్నారు సర్కార్. చాలా గాభరాగా వుంది. [నిష్క్రమి.

తానాషా—రజాక్ సాహేబ్, మనం ఏమి ఉపాయం చేస్తాం?

రజాక్—ఇప్పుడు గోల్కొండవదలి మనం ఎక్కడికి పోలేము. ఖిల్లా భద్రంగావుంది. పది సంవత్సరాలు ముట్టడికి ఫర్వాలేదు హుజూర్.

మొదటి సిఫాయి—[ప్రవే] సర్కార్ సాదత్ ఖాన్ దగ్గ్రానుండి జాబు. [చదువును] నన్ను ఖైదుచేసి మాయింటి చుట్టూకాపలా పెట్టడంలో తాము న్యాయంగానే చేస్తు న్నారు. తమలో న్యాయం లేకపోలేదు. కాని నేను పాదుషా వారి నౌకర్. వారిమీద భక్తిచేత, గౌరవంచేత, వారి మేలు కోరడంచేత ఆవస్తువులు పాదుషావారికి పంపినాన్ గదా. నావద్ద

నాప్రాణంతప్ప ఏమిన్నీ లేదు. కాని నాచావువల్ల మిమ్మల్ని కొట్టి శిక్షించడానికి పాదుషావారికి ఇంకొకకొత్తకారణం దొరుకుతుంది. మిమ్మల్ని క్షమించడానికి ఇప్పుడు మిగిలిఉండే ఆశాతృణం అప్పుడు మాయమౌతుంది. నన్ను మీరువిడిచిపెట్టితే మీకోసం పాదుషావారి దయ సంపాదించడానికి నాకు అవకాశం దొరుకుతుంది. నాప్రాణం ఉండే వరకు తమరు భద్రంగా ఉండే మార్గం వెదకడం నాపని—తమ గులాం, సాదత్ ఖాన్.

తానాషా—[ఆలోచించి] అవును, నిజమే. సాదత్ ఖాన్ చెప్పిందిసరి. ఇతనిని అవమానపఱచడానికంటే గౌరవించడమే మంచిదని తోస్తుంది.

రజాక్—ఆహా! ఎంతలో సుల్తాన్ వారిని మోసంచేసినాడు సాదత్ ఖాన్. ఇదంతా జూటానాటకం సర్కార్. వాడుదొంగ.

తానాషా—పోనీ, వాడు దొంగ అయితే అల్లా వాణ్ణి శిక్షిస్తాడు. మే మెందుకు పాపంచెయ్యడం. అరే ఎవరురా!

సిఫాయి—సర్కార్ హాజర్.

తానాషా—తత్క్షణంపోయి సాదత్ ఖాౕ వారిని గౌరవంగా మాకాడికి తెండి. [సిఫాయి నిష్క్రమించును.

రజాక్—సుల్తాన్వారు ఎంత మంచివారు. పామును ముద్దుపెట్టుకొనే జీవకారుణ్యం. ఇంత ధర్మాత్ముఁడికి లోకం ద్రోహంచేస్తుందే అదే ఆశ్చర్యం.

[సాదత్ ఖాౕ ప్రవేశించును.]

తానాషా—[లేచి] సాదత్ భాయి రండి, రండి. మేం కోపంలో చేసిందాన్ని క్షమించండి. [అని కౌగిలించుకొని] మీరు ఇంత మంచివారని మాకు తెలియకపోయింది. పొరపాటు క్షమించండి.

సాదత్—ఫర్వాలేదు హుజూర్, ఫర్వాలేదు. ఇదంతా లోకంలో సహజం. మీరు గొప్పవారుకాబట్టి త్వరగా తెలుసుకొన్నారు. నాకు స్వాతంత్ర్యంలేదు హుజూర్. పాదుషావారి హుకుం నెరవేర్చే నౌకర్ నేను. మీభాగ్యం పాదుషావారి చిత్తం. మరి నాకు శెల్వియివ్వండి. నేను పోతాన్. సలాం.

[అని నిష్క్రమించును.

తానాషా—ఆహా! ఆశ్చర్యం. దైవగతి. అల్లాచేసేదాన్ని ఏమిచేస్తాం. పాదుషా మమ్మల్ని విడిచి పెట్టడు. ఎంతమాత్రం క్షమించడు.

రజాక్—ఇప్పుడు తెలుస్తావుంది.

తానాషా—ఇంక మనం మనప్రాణాలు కాపాడుకొనే మార్గం చూడవలసిందే. సర్దార్సాహేబ్లు, మీరంతా చాలా గొప్పవారు. మీ అభిప్రాయమే మా అభిప్రాయం. రజాక్ సాహెబ్ మీకోరిక ప్రకారం దర్వాజా తెరవకుండా ఉన్నాం. మీరు మీచిత్తం ప్రకారం చెయ్యండి. లడాయి తప్పదు. ఫౌజ్ తీస్కొని మీరు పాదుషావారి ఫౌజును ఎదుర్కొని లడాయి చెయ్యండి. దేవుడిదయవల్ల మీరు జయించి పాదుషాను పట్టుకొంటే ఆయనకీ చాల మర్యాదచేసి ప్రాణంతో మాదగ్గరికితెండి,

రజాక్—జహాపనా ఆలంఘీరు పాదుషాది దగ్ధహస్తం. ఆయన భస్మాసురుఁడు సర్కార్. ఆయన తాకింది భగ్ అని మండుతుంది సర్కార్. వాడికిచూస్తేనే మాహృదయాలు భగ్ భగ్ అని మండుతుంది. అతడు చేయించిన ఘోరాలు తల్చుకొంటే మాగుండెలు మాడిపోతుంది. ఆద్రోహిని చూస్తే కనికరంరాదు. ఎట్లావస్తుంది సర్కార్. భగవంతుడి దయవల్ల ఔరంగజేబు మాచేతుల్లో పడితే ఎట్వాంటీగౌరవంగాని మేం చూపడానికి లేదు జహాపనా. ఇదిమాత్రం హుజూర్ మన్నించవాలా. అక్కన్న మాదన్నలకి వాళ్లుచేసినపని అతనికి బదులు చెయ్యవలసింది బాకీ ఉంది సర్కార్. మరిసెల్వు—సలాం. సలాం.

తానాషా—సలాం. [అందఱు నిష్క్రమింత్రు].

---

# దృశ్యము ౧౭

ఔరంగజేబు డేరా ముందువీథి.

[ఔరంగజేబు చుట్టును పరివారము ప్రవేశింతురు.]

ఔరంగ—ఓయి సిఫాయ్, ఇదే మా ఆజ్ఞ. సర్దార్ ఫిరోజ్‌తో చెప్పు,— గోలకొండముట్టడి మొదలుపెట్టవలసింది, కోటగోడలదగ్గర పందిళ్లువేసి వాటిక్రిందినుండి సొరంగాలు తవ్వవలసింది—అని.

సిఫాయి—సర్కార్ ఆజ్ఞ. [నిష్క్రమించును].

ఇంకొకసిఫాయి—[ప్రవేశించి] సర్కార్ సలాం. సర్దార్ ఫిరోజ్ జంగ్‌గారి తండ్రిగారు కులిజ్‌ఖాన్ బహద్దర్‌వారు తమ

ఆజ్ఞ విని వీరావేశంతో పోయి గోలకొండ కోట ప్రాకారానికి కాపలా ఉండేసైన్యాన్ని ఎదుర్కొనిపోతావున్నారు.

ఔరంగ—సెబాష్. [రెం. సిపా. నిష్క్రమించును.

మొదటి సిఫాయి—హుజూర్ సలాం. కులీజ్‌ఖాన్ గారు ముసలాయన ఫిరంగి గుండులాగా కోట గోడల దాకా పోయినారు. వీరావేశంతో గోలకొండఫౌజులో శానామందిని నరికినారు. ఎంతచెప్పినా మనవాళ్లు పోవడం లేదు. మన సిఫాయి పీనుగలకే తేవడం కూడా కష్టంగా ఉంది. గోల్కొండా మనసిఫాయీ పీన్గలకే కూడా తీస్కొని పోతావున్నార్.

[నిష్క్రమించును.

ఔరంగ—అచ్ఛా, మేం లంచంయిచ్చి గోల్కొండ సేనాపతులను స్వాధీనం చేస్కొంటాము. తర్వాత చూస్తాం రజాక్ సంగతి.

---

# దృశ్యము ౧౯

తానాషా మంత్రాగారమునకు ముందు వసారా.

[తానాషా రజాకులు ఎదురెదురుగా ప్రవేశించి సలాములు మార్చుకొందురు.]

తానాషా—రజాక్ సాహేబ్ ఏమి సమాచారం?

రజాక్—సర్కార్, ఏమి చెప్దం. పాదుషా లంచం యిచ్చి మనసర్దార్లను షేక్ మిన్హాజ్, షేక్ నైజాములనుస్వాధీనం చేస్కొన్నాడు.

తానాషా—ఆహా! లడాయి ఎట్లా ఉంది.?

రజాక్—మన దగ్గర ఉండే తుపాకిమందు ఆయుధ సామగ్రిలతో బురుజులనుండి, కోటగోడలనుండి, తలుపుసందుల నుండి, మాటులనుండి మనవారు తుపాకులను ఫిరంగులను కాలుస్తున్నారు.

సిఫాయి యొకడు ప్రవేశించి—సర్కార్ సలాం. మన వారు కాల్చే తుపాకులవల్ల ఆకాశం అంతా పొగనిండి అంతా రాత్రివలె అయిపోయింది. దినమంతా ఢిల్లీవారిసైన్యం చాలా పరాక్రమంతో పోరాడుతున్నారు. చాలామంది చచ్చిపోతున్నారు. సొరంగాలు తవ్వేవారు తవ్వుతున్నారు. అగడిత పూడ్చడానికి పాదుషా స్వయముగానే ఒకమూట కట్టివేసినాడు. ఫిరంగులు ఎక్కించడానికి ఎత్తుకట్టడములు కట్టుతున్నారు. సలాం. [నిష్క్రమించును.

మఱియొక సిఫాయి—[ప్రవే] సర్కార్ ఊళ్లో క్షామం చాలా కష్టంగాఉంది. మనుష్యులకు అన్నం లేదు, జంతువులకు గడ్డిలేదు. వర్షాలు లేకపోవడంవల్ల జొన్నలు రాగులు పండ లేదు. పైగా అంటువ్యాధులు బయలుదేరి ఉన్నవి. శానామంది మొగలాయీ సిఫాయీలు అన్నంపెడితే మనకువచ్చి నౌకరీ చేస్తామని వేడుకొంటున్నారు.

తానాషా—మంచిది. వాళ్లను పిలిచి అన్నంపెట్టండి.

సిఫాయి—సర్కార్ వాళ్లు మనకు శత్రువులుగదా.

తానాషా—ఫర్వాలేదు. అన్నం అడిగినవాడికి తానాషా లేదనడు. పెట్టండి వాళ్లకు. ఎవరైతే నేమి. [సిఫాయి నిష్క్రమి.

రజాక్—సర్కార్ నాబొందిలో ప్రాణం ఉండేవరకు పాదుషా గోల్కొండను పట్టలేడు. నేనుపోయి మళ్లీ లడాయికి తయారౌతాన్. సలాం.

తానాషా—అచ్ఛా, పోయిరండి సాహేబ్, సలాం.

[రజాక్ నిష్క్రమించును. లోపల ఫిరంగులు.

మొదటి సిఫా—[ప్రవే] సర్కార్ సలాం. మనకోట కావలి సైన్యం తటాలున పాదుషావారిసైన్యం మీదపడింది. మొగలాయీవాళ్లు దెబ్బ్బతిమంది మర్గయా. మనవాళ్లు ఎందరు పోయినారో తెలీదు. మనకోట గోడమీదనుండి రజాక్ సాహెబ్ ఒక ఫిరంగి గుండును పాదుషాశిబిరం మీదికి గుఱిగా వేసినారు. పాదుషావారు నిద్రపోయేగుడారం దగ్గర ఆగుండు పడింది. మళ్లీ కాలిస్తే అవి చుట్టూ తాకిపోయినవి. పాదుషా గాభరాపడి తనగుడారం దూరంగా తీస్కానిపోయినారు. సర్కార్. [నిష్క్రమించును.

రజాక్—[ప్రవే] సర్కార్ తప్పిపోయింది సర్కార్. కొంచెంలో తప్పిపోయింది. లేకపోతే ఈ పాటికి ఈపాదుషా మట్టిలో కలిసి పోయి ఉండేవాడు.

తానాషా—రజాక్ సాహేబ్, ఆపని అల్లాకు ఇష్టంలేదు.

సిఫా—[ప్రవే] సర్కార్ పాదుషా రెండువందల తోలు కవచాలు తయారుచేయించి పంచిపెట్టినారు. గట్టి నిచ్చెనవేసి

మనఖిల్లా గోడమీదికి తానే ఎక్కపోయి కాలు జారినట్లు చేసి పడినాడు. దాన్కి చూచి మొగల్ సిఫాయీలు గబగబా లగ్గల్ ఎక్కుతున్నారు. [నిష్క్రి.

రజాక్—ఆ! నేను పోయి చూస్తాన్ సర్కార్. [నిష్క్రి.

[లోపల తుపాకులు ఫిరంగులు.

మొ. సిఫాయి—సర్కార్ మన రజాక్ సాహేబ్ గారు మొగలాయీ సిబ్బందిమీదికి మనఫౌజ్‌తో దుమికినారు. లడాయి చేస్తున్నారు దర్వాజా బైట. [మరల తుపాకులు.

రెం. సిఫా—సర్కార్ లారీసాహేబ్‌గారు మొగల్ సర్దార్లకీ పన్నెండుమందికి ఖైదుచేసి ఖిల్లాలోపలికి తెచ్చినారు.

తానాషా—పాపం! వాళ్లను బాధపెట్టవద్దు. అన్నం గిన్నం పెట్టి మర్యాదతో మళ్లీ వాపస్ పంపండి. ఖైదులో పెట్టవద్దు. [సిఫాయీలు నిష్క్రమింతురు.

[రజాక్ ప్రవేశించును.]

తానాషా-రజాక్ సాహేబ్. చాలా మంచిపనిచేసినారు. ఆ మొగల్ సర్దార్లకు మంచి దుస్తులు వగైరాలు యిచ్చి భోజనం పెట్టి, మనకోట అంతా చూపించి పంపండి. ఎంతకాలమైనా లడాయి చెయ్యడానికి మనకు సరఫరాలున్నవి అని పాదుషాకు తెల్వనీ.

రజాక్—హుజూర్ ఆజ్ఞ. [నిష్క్రి.

మొద. సిఫాయి—[ప్రవే] సర్కార్. మొగలాయీలు మనకోట గోడల క్రింద మూడు సొరంగాలు తవ్వి వానినిండా

తుపాకిమందు నిండించినారు. ఈసంగతి ఎట్లాగో ముందే తెలిసి మన సర్దార్ రజాక్‌సాహెబ్వారు ఆసొరంగాలను నీటితో లోపలినుండి తడిపి పెట్టించినారు. మొగలాయీలు నిప్పుపెట్ట గానే రెండు సొరంగాలు మండనేలేదు. ఒక సొరంగం మాత్రం సగం తడిసింది బైటివైపే పేలింది. అందువల్ల మొగలాయీలు వెయ్యిమంది కాలి చచ్చినారు. గోడ కింపడి చాలామంది చచ్చినారు. [నిష్క్రమి.

తానాషా—అల్లా. అల్లా. పాదుషాకు దయరాలేదే.

రజాక్—[వచ్చి] సర్కార్ సలాం. ఆమొగల్ సర్దార్లు పోయి మంచిమాటలు చెప్పినారు. పాదషాగారు సంతోషించి జాబువ్రాసి పంపినారు.

తానాషా—సద్వండి.

రజాక్—[చదువును] "మా ఆజ్ఞను తిరస్కరించే అభిప్రాయం తానాషాకు లేకపోతే ఆతడు తక్షణమే చేతులు జోడించుకొని మాయెదటవచ్చి నిలబడితే మేము మా ధారాళం అంతా చూపిస్తాం."

రజాక్—సర్కార్ ఈజాబు చెప్పి వెంటనే పాదుషా యాభైవేల గోనెసంచులకు మందుగుండ్లకు హుకుం చేసినాడు, మనఖిల్లా అగడ్తలు పూడ్చి గోడలమీదికి ఎక్కడాన్కి. పాదుషా ద్రోహి హుజూర్. మాట ఒకటి పని ఇంకొకటి.

తానాషా—కానీ అల్లా ఉన్నాడు.

రెం. సిఫాయి వచ్చి—సర్కార్ పాదుషా కోపావేశంతో పల్లకియెక్కి లడాయికి సిబ్బందితో తర్లినాడు. మనవాళ్లు ఫిరం

గీలు కాల్చినారు. పాదుషా పల్లకీమోసే సిఫాయి ఒకడు మర్గయా; పాదుషా మాత్రం కదలలేదు. పల్లకీ వస్తావుంది.

రజాక్—సర్కార్ నేను పోయి మళ్లీ పని చూస్తాన్. తాము దూరంనుండి చూడండి.

తానాషా—అచ్ఛా, పోయిరండి. మేముకూడా దూరం నుంచి చూస్తాం. [అందఱు నిష్క్ర.]

---

# దృశ్యము ౧౬

గోలకొండ కోటబయట

[ఇరువురు సిఫాయీలు ప్రవేశింతురు]

1 సిఫాయి—అద్గో దూరంలో అబ్దుల్ రజాక్ లారీ వస్తాడు. మన మొగలాయీ సిబ్బందికి చూస్తాడు.

2 సిఫాయి— అరే ఆయన్కి బాణం వేసికూలుస్తాన్.

1 సిఫాయి—అరేభాయి వద్దు. ఆయన్కి పాదుషా జాబు వ్రాసి పంపినారు. నాచేత ఉంది జాబు. నేను పోయి రహస్యంగా ఇయ్యాలా.

2 సిఫాయి—ఎందుకురా పాదుషాకు ఈయనమీాద అంతమర్యాదా.

1 సిఫాయి—ఈయ్న ఒకడేరా తానాషా సుల్తాన్కార్కి నమ్మకంగా ఉన్నార్. మిగత అంతా ద్రోహులు. అబ్దుల్లాఖాన్ పానీ కూడా మనతట్టు చేరినాడు. ఎప్డో మనకు దర్వాజా తెరవపోతాడు.

[రజాక్ లారీ ప్రవేశించును]

1 సిఫాయి—సర్దార్ సాహెబ్. సలాం. మీకు పాదుషా జాబువ్రాసినారు. [అని ఇచ్చును.]

రజాక్—[చదువుట నభినయించి] ఛీ. ఛండాలీపాదుషా మాకు ఎంతధైర్యంగా జాబువ్రాస్తాడు. నాకు మొగల్‌సర్దార్ చేస్తాడు. 6000 సైన్యానికి మన్సబ్దార్ చేస్తాడూ? ఉద్యోగం, డబ్బు, జాగీర్; ఛీ ఛండాలీ, ఛీ ఛండాలీ, జావురే జావ్. చూడు నీపాదుషా ఫర్మాణా మీద ఉమ్మివేస్తాను. థూ థూ థూ. నాకాలిక్రింద నలిపివేస్తాన్. అరే సిఫాయి పాదుషాకు చెప్పు - ఈ మహాయుద్ధానికి సరిపోయేది ఆ కార్బాలాయుద్ధం తప్ప వేరేలేదు. హజరత్ ఇమాం హుసేన్‌గారితో చేరిఉండి ఆఖరుకు ఆయన మీదనే కత్తి ఎత్తిన ద్రోహులతో, పాపులతో అబ్దుల్‌రజాక్ లారీ ప్రాణం ఉండగా చేరడు. ఆయనతో చచ్చిన ఆడెబ్బై రెండు మందిలో ఒకడివలె, తానాషాతో పడిపోతే నాకు ఇహంలో పరం లోకూడా కీర్తి ప్రతిష్ఠ దక్కుతుంది. ఈప్రాణం అబుల్ హసన్ తానాషా సుల్తాన్వారిదిరా. మీ పాదుషా లంచం రజాక్ తిన డురా తినడు. పోయి మీపాదుషాతో చెప్పు. పో.

[అని నిష్క్రమించును.

సిఫా—ఆహా! ఆహా! ఎంతగొప్పవాడు. ఇట్వంటి రాజ భక్తి దేశభక్తిగలవాళ్లు ఉండే ఈ ఆంధ్రదేశం మనకు స్వాధీన మాతుందా. నేనుపోయి పాదుషాతో ఇదంతా చెప్తాణ.

[ఇరువురు నిష్క్రమింతురు.

---

# దృశ్యము ౨౦

తానాషామందిరము, శయనగృహము

[లేచి నిలిచి పచారు చేయుచుండును.]

తానాషా—ఆహా! హా! నాకోసం అబ్దుల్ రజాక్ లారీ ఎంతకష్టపడుతున్నారు. [లోపల మూడుజాము గంటలు] ఆహా మూడుజాము లైనవి.

సిఫాయి—[పరుగున ప్రవేశించి] సర్కార్, మునిగి పోయింది. అంతా మునిగి పోయింది.

తానాషా—ఏమి? ఏమి? ఏమి జరిగింది?

సిఫాయి—మన సర్దార్ అబ్దుల్లాఖాన్ పానీగారు మొగలాయీల దగ్గా లంచంతిని ఖిర్కి దర్వాజా వాళ్లకు తెరిచినారు. రుహుల్లాఖాన్, ముఖ్ తర్ ఖాన్ వగైరాలు సిబ్బందితో లోపలికి వచ్చినారు. మన అబ్దుల్ రజాక్ లారీసాహెబ్ గారు ఎక్కడనో దూరంనుంచి దీన్ని కనిపెట్టినారు. వారుదగ్గా గుఱ్ఱంలేదు, ఒంటిమీద కవచంలేదు. నిద్రపోతావుండినారో ఏమో తెలీదు. సింహావలె ఉఱికి ఒక పట్టాకత్తిమాత్రంతో ఏదో అక్కడ కనబడిన ఒకజీనులేని గుఱ్ఱంమీద దుమికినారు. రెండుకాళ్లతో దానికడుపు పట్టుకొని ఎడమచేతితో దానిమెడపట్టుకొని కుడిచేతితో రెండు వందలమందిని నఱికినారు సర్కార్. ఆయన ఒళ్లంతా గాయాలు, నెత్తురువాన. ఆగుఱ్ఱంమీదనే ఆయనపడిపోయినారు. ఆగుఱ్ఱం ఎక్కడికో ఆయన్ని తీస్కొని భూరం పారిపోయింది సర్కార్. మొగలాయీలు కోటలోపల్కి గబగబా వస్తావున్నారు.

**తానాషా**—హా! హా! హా! రజాక్‌సాహేబ్, మీ ప్రమాణం నెఱవేర్చుకొన్నారు. మీప్రాణంమీద శత్రువు లోపల్కి రావలెననికోరినార్. ఆలాగే చేస్కొన్నారు. అయ్యో రజాక్ అయ్యోరజాక్‌సాహేబ్. అల్లా! అల్లా!

**సిఫా**—ఆ మొగల్ సిబ్బందికి నరుకుతాపోయి శెన్కాకి తోసి ఎట్లాగో తలుపువెయ్యాలా అని వారి ఆలోచనాకావాలా. అయితే సహాయం లేకోపోయింది సర్కార్. ఒంటిమనిషి, రాత్రి చీకటివేళ. ఏమైపోయినారో తెల్వాదు. మీరు ఎక్కడికైనాపొండి సర్కార్, త్వరగాపొండి. ఆ మూల సొరంగంలోనుంచి ఊరి బయటికిపోవచ్చును హుజూర్. నేను దారిచూపిస్తా.

[దూరమున కత్తుల శబ్దములు వినఁబడును.

**తానాషా**—హుం! ఎక్కడికిపోతాం. ఎక్కడికిపోయినా సైతాన్ వదలడు. గ్రహచారం ఎక్కడికిపోతుంది. రానీ శత్రువు లోపల్కిరానీ, దేవుడుడున్నాడు. ఓయిసిఫాయి తెల్లవారింది, మేం స్నానంచేసి భోజనంచేస్తాం. అంతా తయార్ చేయించు.

[సిఫాయి నిష్క్రమించును.

లోపల హోరుమను శబ్దము.

**తానాషా**—ఏమి ఆశబ్దం? ఓహో మొగల్‌సర్దార్లు వస్తున్నారు. [అని కుర్చీపై కూర్చుండును.

[మొగలాయీ సర్దార్లు ఇరువురు ప్రవేశింతురు]

**తానాషా**—అచ్ఛా మొగల్‌సర్దార్లూ రండి.

మొగల్ సర్దార్లు—సలాం తానాషాసుల్తాన్ బహద్దర్ వార్కి.

తానాషా—సలాం.

మొ. సర్దార్ ఒకడు—అరే! ఈయనకి ఖైద్ చేయ పోతారు సలాంచేస్తారేమిభాయి.

మొ. సర్దార్ ఇంకొకడు—ఆయనకేసిచూస్తే భయం వస్తుంది భాయి. చూడండి ఎంత దర్జా ఉందో ఆయనదగ్రా.

తానాషా—రండి. మేం ఇప్పుడు భోజనం చెయ్య పోతాం. మీరుకూడా మాతో విందు భోజనంచెయ్యండి. తర్వాత అంతా బయల్దేరుతాం.

మొదటిసర్దార్—సాహెబ్, ఇది భోజనానికి సమయమా?

తానాషా—అవును ఇదే, మాకు భోజనవేళ, మొదటి భోజనం.

మొదటిసర్దార్—అది నాకీ తెల్సును. కానీ ఇట్వాంటి సందర్భంలో తమకు నోటికీ ఎట్లాపడ్తుంది సర్కార్.

తానాషా—ఓహో! మీరు సాధారణజనులకీ మనస్సులో ఉంచుకొని మాట్లాడుతున్నారు. నాకు భగవంతుడిలో సంపూర్ణమైన నమ్మకండుంది. ఆయన దయామయుడు, ఈ ప్రపంచంలో అంతా సృజించి ధనికులు దరిద్రులు అనే భేదంలేకుండా కాపాడేవాడు. తన కృపాకటాక్షం ఆయనసేవకుడైన తానాషామీదినుంచి ఎంత మాత్రం మరల్చడు. అతనికి ఏర్పాటుచేసి ఉండే అన్నం తప్పక పంపుతాడు, నా మాతామహా పితామహులు ఇద్దఱున్న

తమకాలం అంతా ఐశ్వర్యంలో గడిపినారు. మాతండ్రిగారు గొప్పగా బ్రదికినారు. కాని నేను కొంతకాలం దారిద్ర్యం అనుభవించవలెనని భగవంతుడి ఆజ్ఞ కాబోలు అనుభవించినాను. మళ్లీ ఆ మహామహుడు ఈ దీనుడిమీద కనికరించి రాజయోగం ఇచ్చినాడు. బికారిగా ఉండిన నేను ఒకగంటలో రాజుఅల్లుడినై పోయినాను. నేను రాజునౌతానని ఎవరున్నూ కలలోకూడా అనుకోలేద. నేనుకూడా. నా ఐశ్వర్యం నేటితో ఐపోతుంది. నేను అంతా అనుభవించినాను. సుఖం, దుఃఖం, సుఖం. ఇదంతా మనం అనుకోవడంలోఉంది స్నేహితులూ. భగవంతుడి దయవల్ల నాహృదయంలో ఏమీకోరికలు లేవు. లక్షలు దానం ఇచ్చినాను, కోట్లు ఖర్చుచేసినాను. ఇప్పుడు రాజ్యాధిపత్యం నాదగ్గనుండి దేవుడు లాగివేస్తున్నాడు. బహుశః నేనేమైనా అపరాధం చేసి ఉంటానేమో. దేవుడు ఈ మాత్రం దయ చూపినందుకు నేను కృతజ్ఞత చూపవలసిందేగాని ఆయన ఆజ్ఞకు చింతించను. నాకాలం ముగిసినతర్వాత ఈ రాజ్యాధికారంను ఆస్తికుడైన అలంఘీర్ పాదుషావారి చేతిలో పెట్టిన భగవంతుడికి వందనములు చేస్తున్నాను. ఇదంతా దైవచిత్రం.

సిఫాయి—హుజూర్ ఖానా తయార్.

తానాషా—రండి, ఆలోచన చేయకండి. మనమంతా స్నానంచేసి నమాజ్ చేసి భోజనం చేస్తాం. తానాషా కడపటి విందు భోజనం చేయండి. భోజనంకాగానే తానాషా మీాఖైదీ. హా! హా! హా! రండి ఖుషిగా పోతాం.

[సర్దారులు ఆశ్చర్యపడుచు తానాషాతో నిష్క్రమింతురు.

# దృశ్యము ౨౧

## ఔరంగ జేబు దర్బార్.

ఔరంగజేబు పరివారము ప్రవేశింతురు.

ఔరంగ—సాదత్ ఖాన్, ఈగోల్కొండా అంతా మనకు స్వాధీనం ఐందికదా. మరి అబ్దుల్ రజాక్ లారి ఎట్లున్నాడు.

సాదత్—హుజూరు హుకుం ప్రకారం ఇద్దరు హకీములు వైద్యం చేస్తున్నారు. రజాక్ సాహేబ్ ఒంట్లో మొత్తం డెబ్బైగాయాలు ఎంచినారు. గాయాలమీదపడిన గాయాలకు లెక్కలేదు. ఒకకన్ను పూర్తిగా పోయింది. కత్తిదెబ్బ నెత్తిమీదపడి చర్మం తెగి కంటికి అడ్డం పడిపోయింది. చాలా కష్టపడి ఈ పదుమూడుదినాలు ఉపచారంచేస్తే కన్ను తెరిచి 'తానాషా తానాషా' అని పలవరించినాడు.

ఔరంగ—అచ్ఛా ఇంక బ్రతుకుతాడు.

రుహల్లాఖాన్—మేం దగ్గరపోయి చూడగానే తానాషా సుల్తాన్ ఏమైనారు అని అడిగినారు సర్కార్. దౌలతాబాద్ కోటలో బందీ ఉన్నారు. గోల్కొండా అంతా పాదుషా వారికి స్వాధీనం ఐంది అని చెప్పినాం. 'హా! హయ్యో మేం పొడుచుకొని చచ్చిపోతాం. మాకీ ఎందుకు కాపాడినారు. మాసుల్తాన్ బందీ ఐనసంగతి నేను ప్రాణంతో వినకూడదు. నాకీ పొడ్వండి. కత్తియివ్వండి, మేం పొడుచుకొని చచ్చిపోతాం.' అని చాలా హాయాసంపడి అడిగినారు.

సాదత్—మేం చెప్పినాం, 'పాడ్షాడాన్కి మాకీ హుకుం లేదు. మీాకి కాపాడి తీస్కోని రమ్మని హుకుం. పాదుషావార్కి మీామీాద చాలా దయా, మర్యాదా, ఖుషి ఉంది' అని చెప్పినాం. ఆయన బదులుచెప్పినారు—'నాకీ ఇంతవర్కు ప్రాణం పోలేదు. నేను బదికి లేస్తే పాదుషాగారికి నౌకర్ మాత్రం కాను. అబుల్ హాసన్ సుల్తాన్ నౌకరీ చేసినవాడు ఇంకొకరికి, అందులో మీా పాదుషాగారికి నౌకరీ చేయడని మాత్రం నమ్మండి. ఇది నిశ్చయం.' అని చాలా కోపం చేసినారు.

ఔరంగ—అచ్ఛా. చాలా గొప్పవాడు. రుహుల్లాఖాన్ మీారు పోయి మా ఉత్తర్వు వినది చెప్పి లారీగారిని ఇక్కడికి పిలుచుకొనిరమ్మని గోల్కొండా సుబేదారుకు చెప్పండి. రజాక్ లారీ సాహేబ్‌గారితో చెప్పండి. 'పాదుషాగారికి మీామీాద చాలా గొప్ప అభిప్రాయం. దయచేసి ఒకమాటువచ్చి వారిని చూడండి. వారి ఆశ పాడుచేయవద్దు.' అని మంచిమాటలు చెప్పి పిలుచుకొనిరండి. ఒకమాటు ఆయనకి చూస్తాం.

రుహుల్లా—చిత్తం హుజూర్. [నిష్క్రమించును.

ఔరంగ—నిజంగా తానాషా దురదృష్టవంతుడు. అబ్దుల్ రజాక్ లారీ వంటివాడు ఇంకొకడు ఉండి ఉంటే బాగుపడి ఉండేవాడు. అప్పుడు ఈ గోల్కొండ ఈజన్మంలో మనకు స్వాధీనం అయి ఉండదు.

సాదత్ ఖాన్—ఈ గోల్కొండ ఎంత గట్టికోట సర్కార్! ఇట్వంటీకోట ఇట్వంటి దేశం ఈహిందూస్తానంలో లేదుహుజూర్. రాష్ట్రానికి కోసం ఇక్కడివాళ్లు పస్తుపడి ప్రాణం ఇస్తారు. చాలా గొప్ప దేశం.

రుహుల్లా—[ప్రవేశించి] జహాపనా సలాం. ఇద్గో అబ్దుల్ రజాక్ లారీ సాహేబ్ గారు తమ దర్శణాన్కి చాలా శ్రమపడి వస్తావున్నార్.

[అబ్దుల్ రజాక్ లారీ ఒడలంతయు ఒక కంటిమీఁదను గాయములకు కట్టిన కట్టులతో ఒక కఱ్ఱను ఊనుకొని ప్రవేశించును. ఆయనను పట్టుకొని ఒకసిఫాయి నిలుచును.

రజాక్—సలాం ఆలంఘీర్ పాదుషాగార్కి.

ఔరంగ—సలాం, సలాం, అబ్దుల్ రజాక్ సాహేబ్. మీరు చాలా గొప్పవారు. ఇంత స్వామిభక్తి, సాహసం, మత గౌరవం చూపినవాళ్లను నేను ఎక్కడా చూడలేదు. మీరు చాలా గొప్పవారు. మీకు ఏంకావలెనో కోరండి మేం సంతోషంగా చేస్తాం.

రజాక్–[వికృత మందహాసముతో] భగవంతుడి దయవల్లా నాకు చావు ఒకటే మిగిలి ఉంది. ఇంక ఏమీవద్దు జహాపనా.

ఔరంగ—పోయిందేమో పోయింది. దాన్కి చింతించవద్దు. మీరు మాతరఫ్‌లో ఈ గోల్కొండాలో నవాబ్‌గా ఉండండి సాహేబ్.

రజాక్—ఆహా! అల్లా! అల్లా! మహాత్ముడు తానాషా. ఆయన ఉప్పుతిని ఎట్టువంటి పాపీ కూడా ఆపని చేయడు. అబ్దుల్ రజాక్ లారి చెయ్యనే చెయ్యడు.

ఔరంగ—పోనీ మావద్దర గొప్ప సేనాపతిగా ఉండండి సాహెబ్.

రజాక్—హుం. తానాషా సుల్తాన్ బహద్దర్ వారినౌకరీ చేసినవాడు ముసల్మానైతే. ఇంకొకడికి నౌకరిచెయ్యడు జహాపనా.

ఔరంగ—ఆహా! సెబాష్. మీకు నౌకరీ యిష్టం లేకపోతే మీ కొమాళ్లకీ యిస్తాం.

రజాక్—ఆవెధవలు ఎట్లాపోతే నాకేమి? తెల్వి ఉంటే బతుకుతారు. లేకపోతే పోతారు. వాళ్లకు నాకూ ఏమి ఇలాఖా సర్కార్.

ఔరంగ—అచ్ఛా! అచ్ఛా! అదినిజం. మీవంటివారు ఇంకొకరు ఈగోల్కొండాలో ఉంటే మేము ఈకోటను పట్టి ఉండలేము. మీరు చాలా గొప్పవారు. మరి మీయిష్టం యేమి సాహేబ్?

రజాక్—జహాపనా నాకు ఏమి యిష్టం ఉంటుంది? మాదేవుడువంటి సుల్తాన్ బందీ. మా బడావజీర్లు, మాకు అన్న తమ్ములవంటి వారు అక్కన్న మాదన్నలు తమ కుట్రవల్ల ఖూనీ

ఐనారు. మాకోట చెడిపోయింది. మా ఆంధ్రనగరం ఆంధ్రదేశం మీవల్ల పాడైపోయింది. ఎక్కడ చూచినా ద్రోహులు కనబడుతున్నారు. ఈముసలి ఆంధ్రుడి ప్రాణం ఈశ్మశానాన్ని చూస్తూ ఇంక ఉండదు జహాపనా, ఇంక ఉండదు. దేవుడు దయచూపిస్తే తానాషా సుల్తాన్‌గార్కి మళ్లీ నౌకరీ చేస్తాన్. ఆయనకు మళ్లీ యీ విశాలాంధ్రం సంపాయిస్తాన్. లేకపోతే,... లేకపోతే బయలుదేరిపోతాన్, పోతాన్ జహాపనా, మక్కాకు పోతాన్, మక్కా, మక్కా, మక్కా.

[అని ఆటోపమున నిష్క్రమించును-
అందఱు నిష్క్రమింతురు.

సంపూర్ణము.

---

చంద్రికా ప్రెస్సు, చాకలపేట, మదరాసు. 25-8-1955

